శ్రీ ర స్తు.

# స న త్సు జా తీ య ము

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్‌సన్సు వారిచే

ప్ర క టి త ము.

1915

ధృతరాష్ట్ర ఉవాచ:—

యా నేవాహు రిజ్యయా సాధులోకాన్
ద్విజాతీనాం పుణ్యతమాన్ సనాతనాన్,
తేషాం పరార్థం కథయ న్తీహ వేదాః
ఏతద్విద్వా న్నైతి కథంను కర్మ. ౧౭

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు అడుగుచున్నాఁడు.—

టీ. అట్లైనఎడల, ఇజ్యయా=జ్యోతిష్టోమాది యాగములచేత, ద్విజాతీనాం = ద్విజులకు, పుణ్యతమాన్ = పవిత్రములైన, సనాతనాన్=నశించని, యానేవసాధులోకాన్ = ఏ మంచిలోకములనే, ఆహుః=చెప్పుచున్నారో, వేదాః=వేదములు, తేషాం = ఆజ్యోతిష్టోమాదియాగకర్మలచేతఁబడయఁదగిన బ్రహ్మలోక పర్యంతలోకములకు, పరార్థం=పరమపురుషార్థత్వమును, ఇహ=ఈసంసారమండలమున, కథయన్తి=చెప్పుచున్నవి. ఏతత్=దీనిని, విద్వాన్=ఎఱిఁగినవాఁడు, కథంను=ఎట్లు సాధనముగా, కర్మనైతి=కర్మను అనుష్ఠింపఁడు లేక ఆచరింపఁడు?

తా. మునివరేణ్యా! అగ్నిష్టోమాదియాగాచరణంబునఁ బుణ్యలోకంబులు గలుగుననియుఁ బుణ్యలోకప్రాప్తి పురుషార్థంబనియు, వేదములు మొఱయిడుచున్నవిగదా. అది యెఱింగిన జ్ఞాని కర్మ నేల చేయకుండు?

సనత్సుజాత ఉవాచ:—

ఏవం హ్యవిద్వా న్నుపయాతి తత్ర
తథాఽర్థజాతం చ వదన్తి వేదాః,
సనేహ ఆయాతి పరంపరాత్మా
ప్రయాతి మార్గేణ నిహంత్యమార్గాన్. ౧౮

సనత్సుజాతఉవాచ=సనత్సుజాతమహర్షి చెప్పుచున్నాఁడు.—

టీ. అవిద్వాన్=అపండితుఁడే, ఏవం =(విషయవిషాన్ధుఁడై బ్రహ్మాది సాధ్యసుఖమునే సత్యమని నమ్మినవాఁడై) యీవిధముగా, తత్ర=

బ్రహ్మలోకాది సాధనభూతములైన కర్మలయందు, పరియాతిహి = ప
మనస్సుగలవాఁడగుచున్నాఁడు. తథా=అదేరీతిగా, వేదాః=వేద
అర్థజాతం చ = ప్రయోజనసముదాయమును, వదంతి=చెప్పుచున్నవి.
ఆ (చిత్సదానందాద్వితీయబ్రహ్మమును తెలియఁగోరి, బ్రహ్మలో
లనిత్యసుఖసాధనములని తెలిసిన) జ్ఞాని, ఇహ = ఈకర్మలకు, న ఆయ
తాఁడు. అనగా చేయనేచేయఁడనుట; (అట్టివాఁడేమి చేయును? అః
పరాత్మా (సన్)=పరమాత్మను తనయాత్మచేతనే పొందినవాఁడై, పర
త్మయై, బ్రహ్మయేయగుచు, పరం ప్రయాతి=పరమునే పొందుచున్నా
మార్గేణ=మంచిమార్గముచేత (బ్రహ్మోపాసనామార్గముచేత), అమార్గా
విరుద్ధమార్గములను, నిహన్తి = పోఁగొట్టుచున్నాఁడు. జననమర
లకు కారణంబులును, సంసారహేతుభూతంబులైన విరుద్ధ మార్గమ
వదలి బ్రహ్మోపాసనామార్గముచేత పరబ్రహ్మత్వమును పొందుచున్నా

తా. బ్రహ్మలోకాదిప్రాప్తికై కర్మములను జేయువాఁడజ్ఞాని.
ములయందుఁ జెప్పిన కర్మఫలములన్నియు ఆయజ్ఞానికేకాని, జ్ఞానికిఁ 7
యాగాదులైన కర్మలు జననమరణంబులకు కారణంబులగుటచేత బ్రహ్మల
దులుప్రాప్తించినను పుణ్యంబు నశింపఁగా మర్త్యలోకప్రాప్తియఁయు
సంసారి యగుచున్నాఁడు. కావున జ్ఞాని యాకర్మమార్గము నవలంబిం
దానిని తప్పుత్రోవఁగా నెంచి,తనయాత్మను బ్రహ్మోపాసనామార్గముచే
బ్రహ్మత్వప్రాప్తి నొందించుచున్నాఁడు. మోక్షమును చెందుచున్నాఁ
ట. ఇందువలన జ్ఞానమే మోక్షసాధనమనియు, జీవపరమాత్మల కేకత
ను స్పష్టీకరింపఁబడినది.

ధృతరాష్ట్ర ఉవాచ:—

కోఽసౌ నియుఙ్క్తే త మజం పురాణం
స చే దిదం సర్వ మనుక్రమేణ,
కింవాఽస్యకార్య మథవాఽసుఖంచ
తన్మే విద్వన్బ్రూహి సర్వం యథావత్.

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. సః=ఆపరమాత్మ, అనుక్రమేణ=వరుసగా, ఇదం సర్వం=ఈ (ఆకాశాది ధరిత్ర్యంతమైనజగత్సృష్టి) సర్వమును, (కరోతిచేత్=చేయునెడల), అజం=జననములేనివాఁడును, పురాణం=ప్రాచీనుఁడైనవాఁడునగు, తం=(సత్యం, జ్ఞానం, అనంతం అను మొదలయిన గుణములుగల) ఆతనిని, కో వా నియుఙ్క్తే=ఎవఁడు ప్రేరేపించును? అస్య=వీనికి, కార్యం=ఫలము, కిం=ఏమి? (నానాయోనులయందు పుట్టుకలు గల వీనివల్ల ప్రయోజనమేమి?) అథవా=లేనియెడల (ఇట్టిసంసారమును పొందని యెడల), అసుఖం చ=అసుఖమేమి? (అనేకయోనులఁ బ్రవేశించి, తనశక్తిని కొంత నంచుంచి, సంసారమును బ్రవేశింపనంతట, అసుఖమేమైనఁగలదా)? విద్వన్=ఓవిద్వాంసుఁడా, తత్సర్వం = అదియంతయు, మే=నాకు, యథావత్ = ఉన్న దున్నట్లు, బ్రూహి=చెప్పుము.

తా. ఆత్మపరమాత్మలకు భేదము లేకుండునేని, జననమరణాదిశూన్యుఁడై పురాణపురుషుండైన యాత్మ నెవ్వఁడు సంసృతిమార్గంబునఁ బ్రేరించు? తనకుఁదాన ప్రవర్తించు నందువేని నానాయోనులం బ్రవర్తింప నతనికెయ్యది కార్యంబు? ప్రవర్తింపకుండిన అసుఖంబెద్ది? లేక-ఈప్రపంచ సృష్టిని పరమాత్మ యేప్రయోజనమునకై చేయుచున్నాఁడు. అట్లు చేయుట వలన అతనికి సుఖమేమైన కలదా? వరుసగా ఒకటి వెంట నొకటిగా సృష్టిలోని పదార్థముల నన్నిటిని ఆపరమాత్మయే సృజించు నెడల అతని నాజ్ఞాపించువాఁడెవఁడు? అట్లు సకలయోనులయందును ప్రవేశించి తనశక్తిని ప్రతిదానియందు కొంతకొంత యుంచి దానిని వర్ధిల్లునట్లు చేయనియెడల అతనికేమైనను అసుఖముఁడునా యని ధృతరాష్ట్రుఁడు మహర్షిని ప్రశ్నించినాఁడు.

సనత్సుజాత ఉవాచ.—

దోషో మహానత్ర విభేదయోగే
హ్యనాదియోగేన భవన్తి నిత్యాః,

తథాఽస్య నాధిక్య మపైతి కించి
దనాదియోగేన భవన్తి పుంసః. ౨౦

సనత్సుజాతఉవాచ = సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. అత్ర=ఇచ్చట, విభేదయోగే=(బ్రహ్మమునకు) నానాత్వయోగము గలుగఁగా, మహాన్ దోషః=గొప్పదోషము (అపాదించుచున్నది). అనాదియోగేన = అవిద్యాసంబంధముచేత, నిత్యాః = (జీవాదులు) నిత్యములయినవి, భవన్తి=అగుచున్నవి, తథా=అవిద్యాసంబంధమునవైనను, అస్య=ఈతనికి, అధిక్యం=స్వరూపాధికత్వము, కించిత్=ఏమాత్రమైనను, నాపైతి=పోఁజాలదు (అనఁగా అద్వితీయుఁడైన పరమాత్మమాయవల్ల బహురూపియైనను, వాఁడొకఁడేయనియు, అతనికి పైవారెవరును లేరనియు తెలియఁదగినది.), పుంసః=జీవులు, అనాదియోగేన=అనాద్యవిద్యాసంబంధముచేత, (బహవో)భవంతి=(అనేకులు) అగుచున్నారు.

తా. కూటస్థుఁడొక్కఁడు కాని యతనియెడ భేదము కానరాదు. ఆతనికిగల యనేకాధికారధర్మభేదంబులచే నతని యేకత్వమును సంశయింపవలసియున్నది. అట్లు సంశయించి కూటస్థుఁడొక్కఁడనియు, నుఱియితరులు లేరనియు యోచించుట మహాదోషము. అనాదియగు మాయాసంబంధముచేత కూటస్థుఁడు బహురూపంబులఁ గానవచ్చును. మాయానిమిత్తమననే యాత్మపరమాత్మలకు లోకమున భేదవ్యవహారము గన్పట్టుచున్నది. ఈ సంసారచక్రమంతయు ననాదిగా నతనివే. కాఁబట్టి యివన్నియు నిత్యములే. అనాదిగా జరుగుచుండు సృష్టి నూతనముగా కల్పింపకపోవుటచేత కూటస్థునియాధిక్యమునకు లోపమేమియు లేదు. ఆతనికి పైవాఁడెవ్వఁడు నెప్పుడును లేఁడు. జీవులందఱును అనాదియైన సంసారబంధమునకు లోఁబడ్డవారే.

యదేతదర్థా భగవాన్ స నిత్యో
వికారయోగేన కరోతి విశ్వమ్,

తథాచ తచ్ఛక్తి రితి స్మ మన్యే
* తదర్థయోగే చ భవన్తి వేదాః. ౨౧

టీ. నిత్యః=నిత్యుఁడగు, సభగవాన్ = ఐశ్వర్యాదులతోఁ గూడు కొనియున్న ఆభగవంతుఁడే, వికారయోగేన = ప్రకృతిసంబంధముచేత, విశ్వం=ఈక్షణాదిపూర్వకమైన విశ్వమును, కరోతి (ఇతి)=చేయుచున్నాఁ డనుట. యత్=యేదున్నదో, తదేతత్=అయ్యదియే, అర్థా=పరమార్థము, లేక, సత్యము. తథాచ=కాబట్టియే, తచ్ఛక్తిః=పరమాత్మశక్తి (మాయచేతచేయు చున్నాఁడు), ఇతిస్మ, మన్యే=అనితలఁచెద, తదర్థయోగే=ఆపరమాత్మకు జగత్కారణత్వమను మాయాసంబంధమునందు, వేదాః=వేదములును, (తస్య మాయాసద్భావే=పరమాత్మకు మాయాసంబంధమునిశ్చయము అను అభిప్రాయమునందు), (ప్రమాణం=ప్రమాణములుగా) భవన్తిచ=అగుచునున్నవి.

తా. భగవంతుఁడు నిత్యుఁడు, ఐశ్వర్యాదిగుణసమేతుఁడు. జగత్తును నిర్మించు అతనిశక్తి మాయ యనఁబడును ప్రకృతిని వికారింపఁజేసి జగత్తును

* తదార్థయోగే అని పాఠాంతరము.

ధృతరాష్ట్ర ఉవాచ.—

యానిహావాః స్వస్య ధర్మస్య లోకాన్
ద్విజాతీనాం పుణ్యకృతాం సనాతనాన్,
తేషాంక్రమాన్ కథయతతోపిచాన్యా
నేతద్విద్వన్ వేత్తు మిచ్ఛామి కర్మ.

తా. ఈ లోకమునందు అగ్నిష్టోమాది పుణ్యకర్మలను జేయు ద్విజులకు, వారిధర్మమునకు, ప్రాచీనమైన ఏమంచిలోకములు సిద్ధించునో, ఆలోకములను వరుసగా వర్ణించవలయును. చెడుపనుల నొనర్చువారి కెట్టిలోకములో వానివరుసను వచింపవలయు ననియు, ఈ కర్మలను గూర్చి తెలిసికొన గోరియున్నాననియు ధృతరాష్ట్రుఁడు ప్రశ్నచేసెను. ఈ శ్లోకమునకు శంకరభాష్యములేదు.

నిర్మించును. ప్రకృతి భగవంతునిశక్తి. వేదవాక్యములు భగవంతునకు మాయ కలదని ఘోషించుచున్నవి.

ధృతరాష్ట్ర ఉవాచ.—

యస్మాద్ధర్మా నాచరన్తీహ కేచి
త్తథాఽధర్మాన్ కేచిదిహాచరన్తి,
ధర్మః పాపేన ప్రతిహన్యతే వా
ఉతాహో ధర్మః ప్రతిహన్తి పాపమ్. ౧౨

ధృతరాష్ట్ర ఉవాచ = ధృతరాష్ట్రుఁ డడుగుచున్నాఁడు.—

టీ. కేచిత్=కొందఱు, ఇహలోకే = ఈలోకమునందు, ధర్మాన్= ధర్మములను, అగ్నిష్టోమాదులను, యస్మాత్ - ఆచరంతి=ఎందుకై చేయుచున్నారు? ఇహకేచిత్=ఇచట మఱికొందఱు, తథా=ఆదేప్రకారము, అధర్మాన్=అధర్మములను, ఆచరన్తి=(ఎందుకై) చేయుచున్నారు? పాపేన= పాపముచేత, ధర్మః=ధర్మము, ప్రతిహన్యతేవా? = కొట్టఁబడునా? ఉతాహో=లేనియెడల, పాపం=పాపమును, ధర్మః=ధర్మము. ప్రతిహన్తివా?= నశింపఁజేయునా ?

తా. లోకములో కొందఱు అగ్నిష్టోమాదులయిన ధర్మము లాచరించుచున్నారు. మఱికొందఱు మాంసభక్షణ సురాపానాదు లాచరించుచున్నారు. ధర్మము మాంసభక్షణాద్యకార్యమువలన నలవడిన పాపమును నశింపఁజేయునా? లేక అధర్మము అగ్నిష్టోమాది ధర్మములను నశింపఁజేయునా? యని ధృతరాష్ట్రుఁడు మహర్షియైన సనత్సుజాతుని నడిగెనని తాత్పర్యము.

సనత్సుజాత ఉవాచ.—

తస్మిన్ స్థితో వాఽప్యుభయం హి నిత్యం
జ్ఞానేన విద్వాన్ ప్రతిహన్తి సిద్ధమ్,
అథాన్యథా పుణ్యముపైతి దేహీ
తథాగతం పాపముపైతి సిద్ధమ్. ౧౩

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. తస్మిన్=పుణ్యాపుణ్యాత్మకకర్మయందు, స్థితోఽపి=ఉండినవాఁడైనను, విద్వాన్=విద్వాంసుఁడు, ఉభయం=ఆరెంటిని, జ్ఞానేన=జ్ఞానముచేత, నిత్యం=ఎల్లప్పుడును, ప్రతిహన్తి=పోఁగొట్టును. ఇదం సిద్ధం=ఇయ్యది యథార్థము. అన్యథా=వేఱొకవిధమున, దేహీ=అజ్ఞాని, యథా=ఏరీతిగా, పుణ్యం=పుణ్యమును, ఉపైతి=పొందునో, తథా = ఆరీతిగానే, ఆగతం=వచ్చెడు, పాపం=పాపమును, ఉపైతి=పొందును. సిద్ధం=ప్రసిద్ధము-నిస్సంశయము.

తా. జ్ఞాని, పుణ్యపాపకార్యములు ఆచరించుచు తనజ్ఞానసత్త్వమున వానిని పోఁగొట్టుకొనును. ఫలాపేక్షతో రెండుధర్మముల ననుసరించువాఁడు పుణ్యపాపఫలములు రెంటిని ననుభవించును.

గత్వోభయం కర్మణా భుజ్యతేఽస్థిరం
శుభస్య పాపస్య సచాపి కర్మణా,
ధర్మేణ పాపం ప్రణుదతీహ విద్వాన్
ధర్మో బలీయా నితి తస్య విద్ధి. ౨౮

టీ. శుభస్య = పుణ్యముయొక్కయు, పాపస్యచ = పాపముయొక్కయు, అస్థిరం=శాశ్వతముగాని, ఉభయం (ఫలం)=రెండుమార్గములైన (ఫలమును), గత్వా=పరలోకమును పొంది, కర్మణా=కర్మచేత, భుజ్యతే=అనుభవింపఁ బడుచున్నది. సచ=ఆ, విద్వానపి=విద్వాంసుఁడును, ఇహ=ఈలోకమందు, ధర్మేణ=ధర్మముచేత, పాపం = పాపమును, ప్రణుదతి = పోఁగొట్టుకొనుచున్నాఁడు, తస్య=అతనియొక్క, ధర్మః=ధర్మమే, బలీయానితి=బలీయమైనదని, విద్ధి=తెలియుము.

తా. పుణ్యపాపకర్మముల ననుభవించుటకు పరలోకములు గలవు. వానిని జీవుఁడచ్చట ననుభవించును; ఉభయ ఫలములు నస్థిరములు; కర్మఫలములను జీవుఁడు కోరక కర్మల నాచరించునేని పుణ్యకర్మలచేత, పాపకర్మఫలములు నశించును అని తాత్పర్యము.

యేషాం ధర్మేషు విస్పర్ధా బలే బలవతామివ,
తే బ్రాహ్మణా ఇతః ప్రేత్య స్వర్గే యాన్తి ప్రకాశతామ్.
యేషాం ధర్మే న చ స్పర్ధా తేషాం తద్జ్ఞానసాధనమ్,
తే బ్రాహ్మణా ఇతో ముక్తాః స్వర్గం యాన్తి త్రివిష్టపమ్.

అవ. కాబట్టి యెట్టివారు స్వర్గమును సాధింతురు? ఎట్టివారు చిత్తశుద్ధి ద్వారా జ్ఞానమును సాధింతురు? అనుటను ఈ రెండుశ్లోకములయర్థము నిరూపించుచున్నది.—

టీ. బలవతాం = బలవంతులైన రాజులకు, బలఇవ = బలవంతులైన రాజులందువలెనే, యేషాం=స్వర్గాది నాసముచేత ఊర్వశి మొదలయిన అప్సరసల భోగములు గలుగునని విని దానిని సాధింపవలయుననునట్టి ఎవరికి, ధర్మేషు=జ్యోతిష్టోమాది ధర్మములయందు, విస్పర్ధా=స్పర్ధకలుగునో, అనగా అట్టిధర్మముల నొనర్చినవారి విషయమై యసూయ గలిగి తామొనర్చి వారివలెనె స్వర్గాది భోగములను పొందవలయు ననునే యసూయగలుగునో యనుట, తే=అట్టి ఫలాపేక్షగల, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, యజ్ఞాధికారులు, ఇతః = ఈలోకము నందుండి, ప్రేత్య = ధూమాదిమార్గము గుండాపోయి, స్వర్గే = స్వర్గలోకమునందు (నక్షత్రాది రూపములతో), ప్రకాశతాం = ప్రకాశత్వమును, యాన్తి = పొందుచున్నారు. యేషాం = విషయములయందు ప్రవేశింపని మనస్సుగలవారును, జ్యోతిష్టోమాదిధర్మములు అనిత్యఫలసాధనములని తెలిసినవారునయినయెవరికి, ధర్మే= అజ్యోతిష్టోమాదిధర్మములయందు, న చ స్పర్ధా=స్పర్ధ లేదో, తేషాం=వారికి, ఫలాపేక్షలేక, చేసినకర్మలను బ్రహ్మార్పణచేయువారికి, తత్=అయ్యాది, (అ యజ్ఞాదికముకర్మశుద్ధిద్వారా) జ్ఞానసాధనం=జ్ఞానసాధనము, ఇతః=ఈ లోకమునందుండి, ప్రేతాః=పోయినవారై (యజ్ఞాదులచేతవిశుద్ధసత్వులై తమ యాత్మచేతనే పరమాత్మనుపొందినవారై), త్రివిష్టపం=ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికముల నెడు తాపత్రయరహితమగుటచే త్రివిష్టపమను పేరు (లేక సత్వాదిగుణరహితమగుటచే లేక, జాగ్రదాద్యవస్థారహితమగుటచే ననియైనను త్రివిష్టప మనిపేరు),గల, స్వర్గం=స్వర్గమును, యాన్తి=పొందుచున్నారు.

తా. బలవంతుఁడైన రాజుం జూచి ఇతరరాజులు వానికంటె తామధిక బలసంపన్నులై యధికరాజ్యమును బడయుదుమని కోరుచుందుము. గర్మాచరణశీలురనుగాంచి వారికంటె నుత్తమకర్మంబులంగావించి యుత్తమసుఖంబులంబడయుదుమని తలంచి పరస్పరస్పర్ధఁజేసి కర్మముల సలిపి ధూమాదిమార్గమున స్వర్గలోకమును బ్రాపించి నక్షత్రాదిరూపమునం బ్రకాశముఁగాంతురు. ఈ రీతిగాఁబరస్పరస్పర్ధ మాని ఫలాపేక్షలేక కర్తవ్యకర్మముల నాచరించి బ్రహ్మార్పణంబుఁ జేయువారు తన్మహిమంబున చిత్తశుద్ధులై, జ్ఞానులై కార్యకారణాత్మకంబైన దీని విడిచి యాధ్యాత్మికాదితాపత్రయంబునకు, సత్వరజస్తమము లను గుణత్రయంబునకును, జాగ్రత్స్వప్న సుషుప్తు లను అవస్థాత్రయంబునకును గోచరంబుకాని పరమాత్మస్వరూపం బాత్మానుసంధానంబునం బడయుదురు. ఇదియ త్రివిష్టపమును బొందుట యని తాత్పర్యము.

తస్య సమ్యక్ సమాచార మాహు ర్వేదవిదో జనాః,
నైనం మన్యతే భూయిష్ఠం బాహ్యామాభ్యంతరం జనమ్.

టీ. వేదవిదః = వేదములనెఱింగినవారైన, జనాః=జనులు, అనగా విద్వాంసులు, తస్య=ఆవిరక్తునియొక్క, సమ్యక్సమాచారం=మంచినడవడికనంతయును, ఆహుః = చెప్పుచున్నారు. ఏనం=వీనిని, అనగా నీయోగిని, బాహ్యామాభ్యన్తరంజనమ్ = (పుత్రమిత్రకళత్రాదిజనము అభ్యన్తరజనము, తదితరము బాహ్యజనము) వెలుపలివారును, లోపలివారు నగుజనము, భూయిష్ఠం=విస్తారముగా, నమన్యతే = ఆదరింపరు.

తా. ఇఁక చెప్పఁబోవునది జ్ఞానియొక్క నడవడిక. దీనిని వేదవిదులు చెప్పిరి. ఈజ్ఞానిని పుత్త్రమిత్ర కళత్రాదిబంధుజనులుగాని, తదితరులుగాని సాధారణముగా నాదరింపరు. కాబట్టి వారు బాహ్యాంభరతరజనుల కగోచరులై చరింతురు.

యత్ర మన్యేత భూయిష్ఠం ప్రావృషీవ తృణోదకమ్,
అన్నపానం చ బ్రాహ్మణ స్తజ్జీవే న్నానుసఞ్జ్వరేత్.

టీ. ప్రావృషి=వానకాలమునందు, తృణోదకమివ = (విస్తారమైన గడ్డియు నీరునువలె, యత్ర=మృగగోచరాది పీడారాహిత్యముగల ఏప్రదేశమునందు, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, అన్నపానంచ = తినుటకన్నము, త్రాగుటకుదకము (దేహపోషణమునకయ్యేకాని భోగనిమిత్తమునకేమాత్రము కాదనుట), భూయిష్ఠం = విస్తారముగా, మన్యేత=(దొరకుననని) తలంచునో, తత్ర (స్థిత్వా)=అచ్చట (ఉండి), తత్=ఆయన్నపానమును, (ఉపజీవన్ = ఉపజీవికఁగా గ్రహించుచు) జీవేత్=బ్రతుకవలయును, నఅనుసజ్జ్యేత్=సంతప్తుఁడు కాఁగూడదు. సంతప్తుఁడైనచో యోగసిద్ధి కానేరదు. కడతేరలేఁడు.

తా. వర్షాకాలమునందు తృణజలసమృద్ధి ఎట్లుండునో అట్లేఅన్నపానాదులు సర్వదాకలిగి సజ్జనపోషణయే ప్రధానమైయుండు బ్రాహ్మణాదిజనంబులుండుచోట విరక్తుఁడైన బ్రహ్మవేత్తయుండును. అని తాత్పర్యము.

యత్రాకథయమానస్య ప్రయచ్ఛత్యశివం భయమ్,
అతిరిక్తమివాకుర్వ౯ స శ్రేయా న్నేతరో జనః. ౨౯

టీ. యత్ర = ఏస్థలమునందు, యః=ఏజనము, అకథయమానస్య = తనమాహాత్మ్యము మున్నగువానిని తెలియనీయక ఉన్న (తనకు) లేక పరమహంసపరివ్రాజకుఁడైన (తనకు), అతిరిక్తం = (పరమేశ్వరునకు చేయునట్టి) గౌరవమును, అకుర్వ౯=చేయకయే, అశివం = అకల్యాణమును, అవమానమును, భయం = భయమును, ప్రయచ్ఛతి=చేయుచున్నదో, స జనః=ఆజనమే, శ్రేయా౯=శ్రేష్ఠము, న, ఇతరః = అన్యజనము శ్రేష్ఠముకాదు.

తా. తనమాహాత్మ్యమును అజ్ఞాని బహిరంగముఁజేయుఁడు. ఎచ్చటనో యొకచోటనుండి తనయాత్మయందే పరమాత్మను కని యానందించుచు మౌనమును ధరించి ప్రకృతిజనులకు జడుఁడుగా నగపడుచుండును. అప్రకృతిజనులు వానినేమాత్రమును గౌరవింపరు. పూజింపరు. అట్టిజనులమధ్యను తాను (అజ్ఞాని) తన నివాసస్థల మేర్పఱచుకొనియుండును.

యోవాఽకథయమానస్య హ్యాత్మానం నానుసంజ్వరేత్,
బ్రహ్మస్వం నోపహన్యాద్వా తదన్నం సమ్మతం సతామ్.

టీ. యః = ఎవఁడు, అకథయమానస్య = అన్నిటిని త్యజించి మౌనియై పూర్ణానందమైన యాత్మతోనుండు నీ పరమహంస పరిప్రాజకుని యొక్క, ఆత్మానం = ఆత్మను, న - అనుసఞ్జ్వరేత్ = తపింపఁజేయఁడో, బ్రహ్మస్వం = బ్రహ్మనిష్ఠాసాధన భూతంబులైన దర్భాసనము, కృష్ణాజినము, పుస్తకము మొదలగువానిని, న ఉపహన్యాద్వా = ఎవ్వఁడు హరింపఁడో, తదన్నం = అట్టివాని యన్నము, సతాం = సత్పురుషులగు జ్ఞానులకు, సమ్మతం = ఇష్టమైనది.

తా. ఎవ్వఁడీజ్ఞానికి మనఃక్లేశంబు లేశమాత్రమును తలఁపఁడో, ఇతని జ్ఞాననిష్ఠాసాధన భూతంబులగు కృష్ణాజిన, దర్భాసన, పుస్తకములు మొదలగువానిని హరింపఁడో, అట్టివారియన్నంబు వారికి భోజ్యంబు.

నిత్య మజ్ఞాతచర్యా మ ఇతి మన్యేత బ్రాహ్మణః,
జ్ఞాతీనాం తు వస న్మధ్యే నైవ విన్దేత కిఞ్చన. ३०

టీ. బ్రాహ్మణః = బ్రహ్మవేత్త, జ్ఞాతీనాం = పుత్త్రమిత్రకళత్రాదులయొక్క, మధ్యే = నడుమను - లేక సన్నిధియందు, ఉపవసన్ = వసించుచున్నను, కిఞ్చన = ఏమియు, నైవ విందేత = పొందఁడు. నిత్యం= నియమముతో నెల్లప్పుడును, మే = నాకు, అజ్ఞాతచర్యా = గూఢవాసము- లేక ప్రచ్ఛన్నత్వము, (స్యాత్) ఇతి=కలుగవలయునని, మన్యేత = తలఁపవలయును.

తా. సర్వసంగవినిర్ముక్తుఁడై నిజమాహాత్మ్యంబుఁ బ్రచురపఱచక గూఢముగా నుంచుకొనియుండునట్టి బ్రహ్మవేత్త స్వకీయమైన తాపంబును గాంచఁడు. పుత్త్రమిత్రకళత్రాదులమధ్య నుండియు నీశరీరసంబంధములగు ఇంద్రియముల కగోచరంబైన పరమాత్మ తత్త్వంబునందు సమాధియోగంబే కర్తవ్యం బను తాత్పర్యంబుతో నుండునట్టివాఁడే బ్రహ్మవేత్త.

గూఢచారియైన బ్రహ్మవేత్తలక్షణము.—"కుటుమ్బం పుత్త్రదారాంశ్చ వేదాఙ్గానిచ సర్వశః, యజ్ఞం యజ్ఞోపవీతం చ త్యక్త్వా గూఢశ్చరేన్మునిః."

కో హ్యేవమన్తరాత్మానం బ్రాహ్మణో మన్తుమర్హతి,
నిర్లిఙ్గ మచలం శుద్ధం సర్వద్వన్ద్వవివర్జితమ్. 32

టీ. నిర్లిఙ్గం = స్థూలసూక్ష్మశరీరవర్జితుఁడును, అచలం = క్రియాకర్తృత్వాది శూన్యుఁడును, శుద్ధం = అవిద్యాదోషరహితుఁడును, సర్వద్వన్ద్వవివర్జితమ్ = సమస్తమైన ద్వంద్వరహితుఁడును (ద్వంద్వము లనఁగా, ఆఁకలిదప్పులు, శోకమోహములు, జరామృత్యువులు, శీతోష్ణములు, సుఖదుఃఖములు), అన్తరాత్మానం = దేహమునందు సాక్షిరూపముగనుండు ఆత్మను, ఏవం=ఈవిధముగ, ఈపై చెప్పినరీతిగా, బ్రాహ్మణః (సఙ)= బ్రహ్మవేత్త ఐ, మన్తుం = తలఁచుటకు, కోహి = ఏవాఁడు, అర్హతి = తగును.

తా. ఆత్మకు స్థూలశరీరముగాని, సూక్ష్మశరీరముగాని లేవు. క్రియాకర్తృత్వాది శూన్యమైనది యాత్మ. స్త్రీపుంసత్వ క్లీబత్వ భేదంబులు లేనిది. ద్వంద్వరహితమైనది. పైయవస్థలు దేహమునకుఁగలవు. ఈరీతిగా శరీరము ఆత్మయు పరస్పర భిన్నధర్మములు గలవి యగుటచేత నెవఁడును దేహమును ఆత్మగా భావించరాదు.

యోఽన్యథా సన్తమాత్మాన మన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా. 33

టీ. యః=ఏవాఁడు, అన్యథా=(నిర్లింగమును, నిర్మలమును, పరిశుద్ధము అనగా పవిత్రమును, సర్వద్వంద్వవివర్జితమును, చిత్సదానందాద్వితీయమైనదిగానుండు) ఒకవిధముగా, సన్తం = ఉండు, ఆత్మానం = ఆత్మను, అన్యథా = వేఱువిధముగా, ప్రతిపద్యతే = తెలిసికొనుచున్నాఁడో, ఆత్మాపహారిణా = ఆత్మ నన్యథాగ్రహించి అపహరించునట్టి, చోరేణ = దొంగయైన, తేన = వానిచేత, కిం పాపం = ఏపాపము, నకృతం = చేయఁ

బడలేదు? ఆత్మను భిన్నముగా తలఁచువాఁడు సమస్తమైన మహాపాతకములను చేసినవాఁడేయనుట.

తా. జ్ఞానస్వరూపియగు ఆత్మను శరీరముగా తలంచఁగూడదు. అట్లెంచువాఁడు దొంగయనఁబడు. వాఁడే మహాపాపి. కాబట్టి శరీరమునకే ఆత్మను ఆరోపింపక, ఇంద్రియాదులకుఁ గానరాని పరమాత్మయందు తదేకధ్యానము గలవాఁడై యుండవలయునని తాత్పర్యము.

అశ్రాన్తస్స్యాదనాదాతా సమ్మతో నిరుపద్రవః,
శిష్టో న శిష్టవత్స్యాద్బ్రాహ్మణో బ్రహ్మవిత్కవిః.

టీ. బ్రహ్మవిత్ = బ్రహ్మవేత్తయును, కవిః = దూరాలోచన సేయువాఁడునైన, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, అనాదాతా = ఆత్మకాని పంచభూతాత్మకమైన దేహమును ఆత్మారోపణచే గ్రహింపనివాఁడు, అశ్రాన్తః = సంసారశ్రమమునొందనివాఁడు, నిరుపద్రవః = ఉపద్రవములు లేనివాఁడునుగా, సమ్మతః = శిష్టత్వముచేత విద్వాంసులచే అంగీకరింపఁబడినవాఁడు, శిష్టః=శిష్టుఁడైనను, న శిష్టవత్ స్యాత్=జడునివలె చరించుచు శిష్టునివలె నుండఁగూడదు.

తా. బ్రహ్మవేత్త సంసారయాత్రకై యవశ్యములైన ధనసంపాదనకుద్యమింపరాదు. అందుకై శ్రమపడకూడదు. వాని నుపద్రవములు చెందవు. తాను శిష్టుఁడయియున్నను నితరులకు శిష్టునివలె నగపడఁదగదు.

యే యథా వాన్తమశ్నన్తి బాలా నిత్యమభూతయే,
ఏవం తే వాన్తమశ్నన్తి స్వవీర్యస్యోపభోజనాత్.

టీ. యే = ఎవరు, (శిష్టవత్ = శిష్టులవలె, స్యుః = ఉందురో అనగా శిష్టవేషధారులైయుందురో,) బాలాః = కుక్కలు, వాన్తం = కక్కినదానిని, యథా = ఏరీతిగా, అశ్నన్తి = తినుచున్నవో, ఏవం = ఈ రీతిగా, తే=వారు, వాన్తం=కక్కినదానిని, అశ్నన్తి=తినుచున్నారు. స్వవీర్యస్య = తమ సామర్థ్యముయొక్క (ను), ఉపభోజనాత్ = సేవిం

చుటవలన (ఏవిధముగా కక్కినదానిని తినుటవలన దేహాదుల కనర్థము సంభవించునో ఆదేవిధముగా), అభూతయే = అనర్థముకొఱకు, (భవతి= ఆగుచున్నది).

తా. తాము బ్రహ్మవేత్తలమని ప్రకటన చేయుచు లోకులచేత పూజాదులంగొనుచు శిష్టత్వవేషము వేసికొని ప్రపంచమును మోసముచేయునట్టి కొందఱు వమనము చేసినదానిని భుజించు కుక్కలవంటివారు.

అనాఢ్యా మానుషే విత్తే ఆఢ్యా వేదేషు యే ద్విజాః,
తే దుర్ధర్షా దుష్ప్రకంప్యా విద్యాత్తాన్బ్రహ్మణ స్తనుమ్.

టీ. యే = ఎట్టి, ద్విజాః = ద్విజులు, మానుషే = శరీరసంబంధమగు, విత్తే = జాయాపుత్త్రిలయిన విత్తాములయందు, అనాఢ్యాః= ఆసక్తిలేని యాత్మగలవారలో, వేదేషు=వేదములయందు చెప్పఁబడియుండు అహింసా, సత్య, అస్తేయ, అపరిగ్రహ, బ్రహ్మచర్య, సమాధిసాధనకర్మలయందు, ఆఢ్యాః=ఆసక్తిగలవారలో, తే=వారలు, దుర్ధర్షాః=దూషింపవీలుకానివారలుగను, దుష్ప్రకంప్యాశ్చ = కదల్పవీలుగానివారుగను, (స్యుః = అగుచున్నారో), తాన్=వారిని, బ్రహ్మణః = పరబ్రహ్మయొక్క, తనుం = శరీరమునుగా, విద్యాత్ = తెలిసికొనవలయును.

తా. మోహజనకములగు జాయాపుత్త్రములగు ధనాదులయం దెట్టివారు విరక్తులో, వేదవిహితకర్మలగు అహింసాదులయం దపరిమితాసక్తిగలవారో, దోషారోపణకెట్టివా రేమాత్ర మెడమియ్యరో, నిశ్చలులగునట్టి విప్రులు పరబ్రహ్మయొక్క ఆకారములుగాఁ దలఁచుట కర్హులు.

సర్వాన్ స్విష్టకృతో దేవాన్ విద్యాద్య ఇహ కశ్చన,
న సమానో బ్రాహ్మణస్య యస్మిన్ ప్రయత తేస్వయమ్.

టీ. ఇహ=ఈలోకమునందు, యః కశ్చన=ఏవాఁడైనను, స్విష్టకృతః= స్విష్టకృత్తులగు, సర్వాన్-దేవాన్=సమస్తదేవతలను, విద్యాత్=తెలిసికొనునో, (సఃఅపి=వాఁడును), బ్రాహ్మణస్య=బ్రహ్మవేత్తకు, న సమానః =

సాటియగువాఁడు కాఁడు. యస్మిన్=ఎవనియందు,స్వయం=తానే,ప్రయత తే=యత్నించునో, సఃఅపిన=ఆదేవతయు అబ్రహ్మవేత్తకు సమానము కాదు.

తా. ఇష్టపరిపూర్తి కొఱకు హవిస్సులు మొదలగు వానిని వేల్చి, తపస్సులు చేసి, దేవతలను స్వాధీనపఱచికొని యుండువాఁడును, అట్టివానికోఁక లీడేర్చు ఆదేవతయు బ్రహ్మవేత్తకు సమాను లెన్నటికి కాఁజాలరని తా.

యమప్రయతమానం తు మానయన్తి స మానితః,
నమాన్యమానో మన్యేత నావమానే విసజ్జ్వరేత్.౩౮

టీ. అప్రయతమానం = తూష్ణీంభూతుఁడు గానున్న (అనగా సర్వోపసంహారంబొనర్చి, బ్రహ్మచర్యాదివ్రతముల సన్యసించి, వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థుఁడై తనమహిమచే గూఢచారిగానుండు) అపరమహంస పరివ్రాజకాచార్యుని, యం=ఏబ్రహ్మవేత్తను,(జనాః=జనులు ఎవరైనను), మానయంతి=గౌరవింతురో,మానితః=గౌరవింపఁబడిన,సః=అతఁడు,మాన్యమానః(ఇతి)=గౌరవింపఁబడుచున్నానని, న మన్యేత=తలఁచఁగూడదు. అవమానే=అవమానమునందు (అవమానపఱచినప్పుడును), నవిసజ్జ్వరేత్=వ్యసనపడఁగూడదు.

తా. ఇట్టి బ్రహ్మవేత్త తానుగూఢచారిగాఁ జరించుచున్నను, కొందఱు బుద్ధిమంతులు తన్ను అట్టివానిగా తెలిసికొని పూజింతురు. అప్పుడు తన్ను పూజించుచున్నారుగదా యని గర్వించరాదు. తా నున్మత్తునివలె, మూఢుఁడుగా గోచరించుటఁజేసి తెలివిలేనివారు కొందఱు తన్ను తిరస్కరింతురు. ఆ తిరస్కారమునకు రోషముగాని, ఖేదముగాని చెందరాదు. అనితాత్పర్యము.

లోకస్వభావవృత్తిర్హి నిమేషోన్మేషవత్సదా,
విద్వాంసో మానయన్తీహ ఇతి మన్యేత మానితః.
అధర్మవిదుషో మూఢా లోకశాస్త్రవివర్జితాః,
న మాన్యం మానయిష్యన్తి ఇతి మన్యేదమానితః.౪౦

టీ. ఇహ=ఈలోకమునందు, విద్వాంసః=విద్వాంసులు,సదా=ఎల్లప్పుడును, మానయన్తి ఇతి ఏతత్=గారవింతురనునది, నిమేషోన్మేషవత్=

కనులుమూయుట తెఱచుటయనునది (ఎట్లుస్వభావధర్మమో), లోకస్వభావవృత్తిర్హి=ప్రకృతిధర్మమనియని, మానితః=గౌరవింపఁబడినజ్ఞాని, మన్యేత=ఎంచవలయును. అధర్మవిదుషః=అక్రమములనే తెలిసినవారు, లోకశాస్త్రవివర్జితాః=లోకశాస్త్రములను రెంటిని తెలియనివారు, మూఢాః = మూర్ఖులు, మాన్యం=గౌరవింపఁదగినవానిని, నమానయిష్యన్తి=గౌరవించరు, ఇతి= అని, అమానితః=గౌరవింపఁబడనిజ్ఞాని, మన్యేత్ = తెలిసికొనవలయును.

తా. తన్ను విద్వాంసులు పూజచేయుచుండిన, బ్రహ్మవేత్త, ఇది జంతువులకు కనులుమూయుట తెఱచుటయనునది యెట్టిధర్మమో యట్టిధర్మమని అందులకే సంతోషింపరాదు. అక్రమమే ధర్మముగానుండువారును, విద్యాగంధమెఱుఁగనిమూఢులు తన్నుతిరస్కరించినయెడల అందులకై బ్రహ్మవేత్త ఖేదపడరాదు. వారి కది స్వభావమని యూరకుండవలయు అని తాత్పర్యము.

నవై మానశ్చ మౌనం చ సహితౌ వసతస్సదా,
అయంమానస్య విషయో హ్యసౌ మౌనస్య తద్విదుః.

టీ. మానశ్చ=మానము, మౌనంచ=మౌనమును, సదా=ఎల్లప్పుడు, సహితౌ=కూడినవై, నవసతః-వై=ఉండవు. అయం=ఈ లోకము, మానస్య విషయః=మానమునకు సంబంధించినది. అసౌ=పరలోకము, మౌనస్య(విషయః) =మౌనమునకు సంబంధించినది. తత్=దానిని, విదుః=పండితులెఱుంగుదురు.

తా. ప్రత్యక్షాదిగోచరసాధ్య మీలోకము; మౌనసాధ్యము పరలోకము; గౌరవము అపేక్షించువారి కీలోకమునను, మౌనముగలవానికి పరలోకమునను ఫలము సిద్ధము అని తాత్పర్యము.

"తత్" అనుపదము పరబ్రహ్మమునకు పేరు. "తత్" శబ్దవాచ్యమగు పరబ్రహ్మము మౌనసాధ్యము. శ్లో. "అన్నాజ్ఞనాదిభోగేషు భావో మాన ఇతి స్మృతః, బ్రహ్మానన్దసుఖప్రాప్తిహేతు ర్మౌన మితిస్మృతం"-అనగా ఆహారవ్యవహారములయందును, భోగాదుల కనుకూలురైన స్త్రీలయందును

లంపటత్వము మానమనియు, బ్రహ్మానన్దసుఖప్రాప్తికి హేతువు మౌన మనియు స్మృతులు చెప్పుచున్నవి అని తాత్పర్యము.

శ్రీర్హి మానార్థసంవాసాత్సా చాపి పరిపన్థినీ,
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ. ౪౨

టీ. హే క్షత్రియ = ఓ రాజా! మానార్థసంవాసాత్ = మానముకొఱకు నివసించుటవలన, (అనఁగా మానగోచర ప్రపఞ్చమునందున్నవారై, స్వర్గ, పశు, అన్నాదిసాధన భూతమైన కర్మలనొనర్చు విషయ విషాస్థునకు) (శ్రీః) భవతిహి = సంపద కలుగుచున్నది గదా? సాచఅపి = ఆసంపదయును, పరిపన్థినీ = శ్రేయస్సునకు అభ్యంతరము కలిగించునదియే. ప్రజ్ఞాహీనేన=జ్ఞానశూన్యునిచేత, బ్రాహ్మీ శ్రీః=బ్రహ్మానందలక్షణము నెడు సంపద, సుదుర్లభా హి = పొందుటకు శక్యముకానిది గదా?

తా. గౌరవము అనగా మానము నపేక్షించి కర్మలఁజేయువాఁడు సంపదలఁబడయును. ఆసంపదలు బ్రహ్మానంద ప్రాప్తికి నిరోధము కలుగఁజేయును. ఈరీతిగ సంపద లపేక్షించి కర్మ లొనరించువాఁడు విషయప్రవర్తకుఁడై బ్రహ్మవేత్త కానేరఁడు.

ద్వారాణి సమ్యక్ప్రవదన్తి సన్తో
బహుప్రకారాణి దురాచరాణి,
సత్యార్జవే హ్రీర్దమశౌచవిద్యా
షణ్మానమోహప్రతిబన్ధకాని. ౪౩

టీ. సన్తః = సత్పురుషులు, సత్యార్జవే = సత్యమును, ఆర్జవమును (భూతహితమైన సత్యమును పలించుటయే సత్యమనఁబడును; ఆర్జవము అనఁగా అకౌటిల్యప్రవర్తన), హ్రీః = అకార్యములనొనర్చుటయందు సిగ్గు, దమశౌచవిద్యాః=దమమును, శౌచమును, విద్యయును, (అంతఃకరణనిగ్రహము దమము, బాహ్యేంద్రియనిగ్రహమని కొందఱిమతము; కల్మషప్రక్షాలనము శౌచము; విద్య బ్రహ్మవిద్య), షట్ = ఈయాఱును, బహుప్రకా

రాణి = పలువిధములును, దురాచరాణి = ఇతరు లాచరించుటకు కష్టము లైనవియు, మానమోహప్రతిబన్ధకాని = మానమునకును మోహమునకును అడ్డులైన, ద్వారాణి = బ్రహ్మలక్ష్మీప్రవేశక ద్వారములుగా, సమ్యక్ ప్రవదన్తి = లెస్సగా పలుకుచున్నారు.

తా. సత్యము, ఆర్జవము, హ్రీ, దమము, శౌచము, విద్య ఈయాఱును బ్రహ్మవేత్తలను ఆనందింపఁజేయునవి. అజ్ఞానము నివి యాఱును నశింపఁజేయును. ఇవి సులభసాధ్యములు గావని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయ్యాసిక్యాం ఉద్యోగపర్వణి ధృతరాష్ట్రసనత్కుమారసంవాదే శ్రీమత్సనత్సుజాతీయే ప్రథమోఽధ్యాయః.

---



శ్రీ ర స్తు.

# స న త్సు జా తీ య ము.

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



వైశంపాయన ఉవాచ.—

తతో రాజా ధృతరాష్ట్రో మనీషీ
సంపూజ్య వాక్యం విదురేరితం తత్,
సనత్సుజాతం రహితే మహాత్మా
పప్రచ్ఛ బుద్ధిం పరమాం బుభూషన్. ౧

వైశంపాయనః=వైశంపాయనుఁడు, ఉవాచ=చెప్పుచున్నాఁడు.—

టీక. తతః=పిమ్మట, మనీషీ=ప్రజ్ఞాశాలియు, మహాత్మా=బుద్ధిమంతుఁడునగు, రాజా ధృతరాష్ట్రః=రాజైన ధృతరాష్ట్రుఁడు, విదురేరితం=విదురునిచేత చెప్పఁబడిన, తత్=ఆమాటను (సనత్సుజాతుఁ డదివఱకు తనతోఁ జెప్పినదని విదురుఁడు రాజుతోఁ జెప్పినమాటను), సంపూజ్య=సమ్మానించి, రహితే=ప్రకృతిజనులులేని స్థలమునందు, పరమాం బుద్ధిం = ఉత్తమమైన పూర్ణానందాద్వితీయ విషయమును, బుభూషన్=పొందుట కిచ్ఛయించినవాఁడై, పప్రచ్ఛ = ప్రశ్న చేసెను.

తా. సనత్సుజాతమహర్షి తనతోఁ జెప్పినదని విదురుఁడు చెప్పిన విషయమును ధృతరాష్ట్రుఁడు శిరసావహించి పామరు లెవ్వరును లేని రహస్యస్థలమున నాపూర్ణానందాద్వితీయవిషయమును లెస్సగా తెలియఁగోరి సనత్సుజాతమహర్షిని ప్రశ్న చేసెను.

ధృతరాష్ట్ర ఉవాచ.—

సనత్సుజాత యదిదం శృణోమి
మృత్యుర్హి నాస్తీతి తవోపదేశమ్,
దేవాసురా ఆచర న్బ్రహ్మచర్య
మమృత్యవే తత్కతరన్ను సత్యమ్. ౨

ధృతరాష్ట్రః = ధృతరాష్ట్రుఁడు, ఉవాచ = చెప్పుచున్నాఁడు (అడుగుచున్నాఁడని తాత్పర్యము).—

టీ. సనత్సుజాత=ఓ సనత్సుజాతమహర్షీ! తవ=నీదైన, యత్=ఏ, ఇదం=ఈ, ఉపదేశం=బోధను, శృణోమి = వినుచున్నానో, తత్=అది, మృత్యుః=మృత్యువే, న అస్తి ఇతి=లేదని (కదా!), దేవాసురాః=(అయితే ఇంద్రుఁడు మొదలైన) దేవతలును, (విరోచనుఁడు మొదలైన) అసురులును, అమృత్యవే=(తమకు) మృత్యువు లేకపోవుటకొఱకు, బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యవ్రతమును - గురుకులవాసవ్రతమును, ఆచరన్ = చేసిరికదా! తత్=అందువలన, కతరన్ను=ఎయ్యది, సత్యమ్=సత్యము?

తా. "మృత్యువే లేదని, ఓసనత్సుజాతమహర్షీ! నీవు విదురాదుల కుపదేశించితివి. దేవాసురశ్రేష్ఠులగు ఇంద్రవిరోచనాదులు తమకు మృత్యువు లేకపోవుటకై బ్రహ్మచర్యవ్రతమను గురుకులవాస మొనరించిరని యుపనిషత్తులందున్నదే—మృత్యువే లేనియెడల వారావ్రత మాచరించుటేల? మృత్యువు లేదనియా? ఉన్నదనియా? ఈయుభయపక్షములలో సత్యమేది?"

శ్రీసనత్సుజాత ఉవాచ.—

శ్లో. అమృత్యుః కర్మణా కేచి న్మృత్యుర్నాస్తీతి చాపరే,
శృణు మే బ్రువతో రాజన్ యథైతన్మా విశఙ్కిథాః. ౩

శ్రీసనత్సుజాతః=(జ్ఞానసంపదచేనొప్పు) సనత్సుజాతుఁడు, (ఈరీతిగాఁబ్రశ్నింపఁబడినవాఁడై) ఉవాచ=చెప్పుచున్నాఁడు.—

తా. విరోచనాదులగునసురులు ప్రమాదభ్రాంతిచేతఁ జెడిరి. ఇంద్రాదులైన సురలు. ఆత్మను స్వాభావిక చిత్సదానందాద్వితీయ బ్రహ్మమే యని భావించి బ్రహ్మత్వమునుపొందిరి. వ్యాఘ్రము మృగములనుంబోలె మృత్యువు ప్రాణులం జంపు ననుట యసత్యము. మృత్యువునకు రూపమే లేదు.

యమం త్వేకే మృత్యు మతోఽన్యమాహు
రాత్మావాస మమృతం బ్రహ్మచర్యమ్,
పితృలోకే రాజ్య మనుశాస్తి దేవ
శ్శివ శ్శివానా మశివోఽశివానామ్. ౬

టీ. ఆత్మావాసం=ఆత్మ యునికిపట్టుగాఁగలవాఁడును, అమృతం=మరణరహితుఁడును, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యవ్రతము గలవాఁడును, అగు, యమం=యముని, ఏకే=కొందఱు, అతః=దీనికంటె, అన్యం=వేఱైన, మృత్యుం=మృత్యువునుగా, ఆహుః=చెప్పుచున్నారు. దేవః=(ఆ) దేవుఁడు, పితృలోకే=పితృలోకమునందు, రాజ్యం=రాజ్యమును, అనుశాస్తి=పాలించుచున్నాఁడు. శివానాం = పుణ్యకారులకు, శివః=సుఖప్రదుఁడును, అశివానాం=పాపకారులకు, అశివః=కష్టప్రదుఁడు నగుచున్నాఁడు.

తా. కొందఱు, "యముఁ డనుదేవత ఈమృత్యువునకంటె వేఱైన మృత్యువనియు, ఆదేవుఁడు పితృలోకపాలకుఁ డై, పుణ్యాత్ములకు సుఖమును, పాపాత్ములకు కష్టమును ఇచ్చుచున్నాఁడు" అనుచున్నారు. విచారింపఁగా నందఱిహృదయస్థుఁడైన పరమాత్మయే యముఁ డనుట సత్యము.

అస్యాదేశా న్నిస్సరతే నరాణాం
క్రోధః ప్రమాదో మోహరూపశ్చ మృత్యుః,
అహంగతేనైవ చర న్విమార్గా
న్నచాత్మనో యోగముపైతి కించిత్. ౭

టీ. క్రోధః=క్రోధరూపమును, మోహరూపః-చ = మోహరూపమును అయిన, ప్రమాదః=ప్రమాదమనియెడు, మృత్యుః=(అజ్ఞాన)మృత్యువు,

న్యాదేశాత్ = అస్యమను పేరుతో, నిస్సరతే = (కామాత్మయై అహం కారమునుండి) బయలువెడలుచున్నది. అహంగతేన=(ఇది) అహంకారము ను చెందుటచేత, విమార్గానేవ=(శ్రౌతస్మార్తసంబంధమైన) తప్పుదారులనే, చరన్=సంచరించుచు, కించిత్=ఏమాత్రమును, ఆత్మనః=పరమాత్మయొ క్క, యోగం=సమాధిలక్షణమును, న ఉపైతి=పొందదు.

తా. అస్యమనగా అభిమానాత్మకాహంకారము. మృత్యువీయ హంకారముతోకూడి కామమనంబడును. ఈకామమునకు స్వేచ్ఛాప్రవర్తన కడ్డు కలిగిన, క్రోధముగా పరిణమించును. ‹‹ కామాత్క్రోధోఽభిజాయ తే›› అని గీతావచనము. క్రోధమువలన అవివేకము కలుగును. ఆయవివేకము మోహమనఁబడును. ఇట్లు క్రమక్రమముగా తప్పుదారులను ద్రొక్కి శరీర మునే తాను అనుకొనుటచేత ప్రాణి సమాధిలక్షణంబైన పరమాత్మయోగం బుఁ గాంచనేరదు.

తే మోహితా స్తద్వశే వర్తమానా
ఇతః ప్రేతా స్తత్ర పునః పతన్తి,
తత స్తం దేవా అను పరిప్లవన్తే
అతో మృత్యుం మరణా దభ్యుపైతి. ౮

టీ. మోహితాః = (శరీరమే యాత్మయను భ్రాంతిచే) మోహ మొందిన, తే = ఆ యసురులు, తద్వశే = అప్రమాదరూపమైన మృత్యు వందు, వర్తమానాః=ఉన్నవారై, ఇహ=ఇచ్చటినుండి, ప్రేతాః=ధూమాది మార్గముచే పైకిపోయి, తత్ర = అచ్చట, (ఉషిత్వా = (కొంతకాలము) ఉండి), పునః=మరల, పతన్తి = (ఆకాశాదిరూపములతో) క్రిందఁ బడు చున్నారు. తతః=(దేహముధరించిన) తర్వాత, తం=దానిని, దేవాః = ఇంద్రియములు, అను = (కర్మల) ననుసరించి, పరిప్లవన్తే = అంతటఁ బ్రవ ర్తించుచున్నవి. అతః = ఈ కారణమువలన, మృత్యు = ఇంద్రియగుణాను సరణరూపమైన మరణమును, (యాతి = పొందుచున్నది). మరణాత్ = ఆ

టీ. కేచిత్=కొందఱు, కర్మణా=(వేదోక్త)కర్మచేత, అమృత్యు మృత్యురాహిత్యము కలుగునని చెప్పెదరు. అపరే = పైపక్షముకాక యి రులు, మృత్యుః = మృత్యువే, నాస్తీతిచ = లేనేలేదనియు (వచించెదరు), రాజన్=ఓరాజా! ఏతత్=ఈరెండుపక్షముల యవిరోధభావము, యథా= ఏవిధమో, తథా=ఆవిధమును, బ్రువతః=చెప్పెడు, మే=నాయొక్క (నిశ్చ యాభిప్రాయము), శృణు=వినుము, మావిశంకిథాః=నాచేఁజెప్పఁబడిన య ర్థమునం దేవిధమైన సంశయము వలదు.

తా. వేదోక్తకర్మాచరణచే అమృతత్వప్రాప్తి యని కొందఱును, మృత్యువనునదియే లేదని కొందఱును అభిప్రాయపడుచున్నారు. ఈయు భయపక్షములకును, ప్రత్యక్షభేదము కనఁబడుచున్నను, భేద మేమాత్రము లేదని నేను నుడువుచున్నాఁడను. సంశయ మేమాత్రము వలదు.

కథమ్ ?—

ఉభే సత్యే క్షత్రియాద్య ప్రవృత్తే
మోహో మృత్యుస్సమ్మతో యః కవీనామ్,
ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి
సదాఽప్రమాదమమృతత్వం బ్రవీమి. ౪

కథమ్=భేద మెట్లు లేదనియెదవేని.—

టీ. క్షత్రియా=ఓరాజా ఆద్యప్రవృత్తే=సృష్ట్యాదియందుండి వాడఁ బడుచున్న, అనియు, క్షత్రియాద్య=ఓక్షత్రియప్రధానుఁడా! ప్రవృత్తే=జరు గుచున్న, అనియు విభజన, ఉభే=రెండుపక్షములును, సత్యే=యథార్థములు. మోహః=మోహమే, మృత్యుః=మృత్యువు; యః=ఏవిషయము, కవీనాం= జ్ఞానవంతులకు, సమ్మతః=సమ్మతము. అహం=నేను, ప్రమాదం=ప్రమాద మునే, మృత్యుం = మృత్యువునుగా, బ్రవీమివై = వచించుచున్నాఁడను. సదా = ఎల్లప్పుడును, అప్రమాదం=ప్రమాదరాహిత్యము, అమృతత్వం= అమృతత్వమునుగా, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. "ఓరాజశ్రేష్ఠుఁడా! ఈరెండుపక్షంబులు యథార్థములై ప్రవర్తిల్లుచున్నయవి. మోహమే మృత్యువని బుద్ధిమంతులు తలంతురు. అనాత్మయందు ఆత్మాభిమానమే మృత్యువనికొందఱు పలుకుదురు. అదియే మోహమనంబడు. ప్రమాదమును మృత్యువనియు, ప్రమాదరాహిత్యమే అమృతత్వమనియు నామత" మని మహర్షి నుడువుచున్నాఁడు.

అనాత్మయందు ఆత్మను భావించుట మృత్యువనియు, అదియే మోహమనియు కొందఱు పలుకుదురు. సనత్సుజాతుఁడు వీరియభిప్రాయముతో తానేకీభవించలేదు. తానెవ్వఁడో ఎఱుంగక పోవుటయే మృత్యువు. అదియే ప్రాణులజననమరణములకు కారణంబు. తానే బ్రహ్మమని భావించుట అప్రమాదము. అట్లు తన్నెఱింగినవాఁడే మోక్షార్హుఁడు.

ప్రమాదాద్వై అసురాః పరాభవ
న్నప్రమాదా ద్బ్రహ్మభూతా స్సురాశ్చ,
నవై మృత్యు ర్వ్యాఘ్ర ఇవాత్తి జన్తూ
న్నాప్యస్య రూప ముపలభ్యతే హి. ౫

టీ. అసురాః=(విరోచనాదులైన) అసురులు, ప్రమాదాత్-వై=ప్రమాదమువలననే - అనగా ననాత్మయందు దేహాదికము నాత్మగా భావించుటవలననే, పరాభవన్=పరాభవమును పొందిరిగదా! అప్రమాదాత్=అప్రమాదమువలన - అనగా, స్వాభావిక చిత్సదానందాద్వితీయబ్రహ్మభావమువలన, సురాశ్చ=(ఇంద్రాదులైన) దేవతలును, బ్రహ్మభూతాః=బ్రహ్మత్వమును పొందిరి. మృత్యుః=మృత్యువు, జన్తూన్ = జంతువులనగా ప్రాణులను, వ్యాఘ్రః ఇవ = పెద్దపులివలె, న-అత్తి-వై=భుజించదుగదా! అస్య = ఈ మృత్యువునకు, రూపమపి = ఆకారమైనను, న-ఉపలభ్యతే-హి = కనబడదుగదా!

అసురులు—చలించు ఇంద్రియవ్యాపారమే ప్రధానముగాఁ గ్రీడించువారు.
సురలు—నిశ్చల, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తభావమైన బ్రహ్మమునందే యాసక్తిగలవారు.

అభిధ్యా వై ప్రథమం హన్తి చైనం
కామక్రోధౌ గృహ్య చైనం తు పశ్చాత్,
ఏతే బాలాన్మృత్యవే ప్రాపయన్తి
ధీరాస్తు ధైర్యేణ తరన్తి మృత్యుమ్. ౧౧.

టీ. ఏనం=వీనిని, ప్రథమం=తొలుతొల్తనే, అభిధ్యా=విషయాపేక్ష, హన్తి వై=నశింపఁజేయుచున్నదిగదా? పశ్చాత్=పిమ్మట, ఏనం=వీనినే, కామక్రోధౌ= కామక్రోధములు, గృహ్య=గ్రహించి, (హన్తి=నశింపఁజేయును.) ఏతే=(కామక్రోధ వశగతంబులైనయా) విషయప్రవృత్తిమున్నగునవి, బాలాన్=వివేకహీనులైన మూఢులను, మృత్యవే=మృత్యువుకొఱకు, ప్రాపయన్తి=పొందించుచున్నవి. ధీరాఃతు=పండితులైన ధీరులన్నో, ధైర్యేణ=ధీరత్వముతో (విషయాన్ జిత్వా=విషయాదులను జయించినవారై- అనగా భోగసుఖాదులకు లోఁబడనివారై),మృత్యుమ్=మృత్యువును, తరన్తి=దాఁటుచున్నారు - అనగా అతిక్రమించెదరు.

తా. విషయాపేక్ష మునుమున్న అట్టివాని నశింపఁజేయఁబూనుకొనును. కామక్రోధములును వెంటనే విషయాపేక్షాకార్యమునకు సహకారియై వానినాశమునకు మఱింత తోడ్పడును.మూఢులు మృత్యువుపాలగుట కివియే కారణభూతంబులు. విద్వాంసులు తమజ్ఞాననేత్రముచేత విషయాదుల వ్యాపారములఁ గనుఁగొని ఆత్మయందే పరమాత్మను ఎఱింగినవారగుచున్నారు. మృత్యువు నతిక్రమించుచున్నారు.

యోఽభిధ్యాయ న్నుత్పతిష్ణూ న్నిహన్యా
దనాచారేణాప్రతిబుధ్యమానః,
నవై మృత్యుం మృత్యురివాత్తి భూత్వా
హ్యేవం విద్వాన్ యోఽభిహన్తిహ కామాన్. ౧౨.

టీ. యః=ఏవాఁడు, అభిధ్యాయన్=ఆలోచించుచు (విషయములనిత్యములు, అపరిశుద్ధములు, దుఃఖములతో నుండునవి యని), అనాచా

ణ=(అవిషయాసక్తుఁడై) వానిని ఆచరింపకపోవుటచేత-వానియందు దాదర ము లేమిచే, అప్రతిబుధ్యమానః=లక్ష్యపెట్టనివాఁడై, ఉత్పతిష్ఠాన్=పైపైకి లేచుచుండు విషయములను, నిహన్యాత్=వదలునో లేక త్యజించునో, ఏవం=ఈవిధముగా, విద్వాన్=తెలిసికొనిన, యః=ఎవ్వఁడు, కామాన్=కోరికలను, అభిహన్తి=చంపుచున్నాఁడో, సః=అధీరుఁడు. అపండితుఁడు, మృత్యుం=మృత్యువును,మృత్యురివభూత్వా=తానేమృత్యువువలెనై,అత్తి=భక్షించుచున్నాఁడు.

తా. భోగాదివిషయములు అనిత్యములు, అపరిశుద్ధములు, దుఃఖ భాజనములని యాలోచించి వాని నేమాత్ర మాదరింపక,వదలు విద్వాంసుఁ డు మృత్యువునకు మృత్యు వగుచున్నాఁడు. వానిచెంతకు మృత్యు వెన్న టికిఁ బోఁజాలదని తాత్పర్యము.

కామానుసారీ పురుషః కామా నను వినశ్యతి,
కామా న్వ్యుదస్య ధునుతే యత్కించి త్పురుషో రజః.౧౩

టీ. కామానుసారీ=కామముల ననుసరించిన, పురుషః=పురుషుఁడు, కామానను=కామములతోడనే, వినశ్యతి=నశించును (కామగుణములు అని త్యములు,క్షణక్షణే పుట్టుచుండును, వెంటనే నశించుచుండును, వాని నను సరించిన పురుషుఁడును, వానితోనే నశించుననుట).కామాన్= కామముల ను, వ్యుదస్య=త్యజించి (న), పురుషః=పురుషుఁడు, యత్కించిత్=(ఈజ న్మమునందును, జన్మాంతరమునందు నుపార్జించియున్న) ఏదైనను, రజః= పుణ్యపాపాదిలక్షణకర్మను, ధునుతే =(జ్ఞానముచేత) ధ్వంసము చేయు చున్నాఁడు.

తా. కామాదులు క్షణభంగురములు, నిమిషనిమిషమున నుత్పత్తి లయములఁ జెందుచుండును. తదనుసారియైన పురుషుఁడు వానితో నశించు చుండు. అస్థిరములైన కామములను త్యజించి బుద్ధిమంతుఁడు వాని తెరువు నకు పోక, ప్రతిజన్మమునందు చేసియున్న పుణ్యపాపకర్మలను నిరసించి సద్గ తిని బడయును.

యింద్రియానుసరణరూపమగు మరణములవలన, జన్మ=పునర్జన్మను, అభ్యేతి=పొందుచున్నాఁడు.

తా. అహంకారమువలన అజ్ఞానులై దేహమునే పరమాత్మగా భావించి ప్రమాదమనియెడు మృత్యువునకు లోఁబడి స్వర్గనరకాదులకుఁ బోయి కొంతకాలముండి; ఆకాశము, వాయువు, వృష్టి, సస్య, అన్న, శుక్ల, శోణితములతో సంబంధించి జన్మాంతరమున కీలోకమునకు వచ్చెదరు. పూర్వకర్మానుసారులై జన్మమెత్తగానే ఇంద్రియవశగతు లగుదురు. ఈప్రకారము జననమరణపరంపరారూపంబైన సంసారచక్రంబున పరిభ్రమించుచు ముక్తిని చెందకుందురు. అని తాత్పర్యము.

కర్మోదయే కర్మఫలానురాగా
స్తత్రానుయాన్తి న తరన్తి మృత్యుమ్,
సదర్థయోగానవగమాత్సమంతాత్
ప్రవర్తతే భోగయోగేన దేహీ. ౯

టీ. కర్మోదయే=కర్మము ఉత్పత్తికాఁగానే, కర్మఫలానురాగాః సన్తః = కర్మఫలములయందాసఁ గలవారలయి, తే=వారు, తత్ర=ఆకర్మ ఫలములను, అనుయాన్తి = అనుసరింపుచుందురు. (ఏకారణమువలన ఆకర్మ ఫలముల ననుసరింతురో అదే కారణముచేత)మృత్యుమ్=మృత్యువును, న తరన్తి=దాఁటలేరు. (మరల మరల జననమరణాత్మకమైన సంసారచక్రమున పరిభ్రమించుచురని) దేహీ=ప్రాణి, సదర్థయోగానవగమాత్=పరమాత్మ సంబంధము నేమాత్రమును తెలియక పోయినవాఁడగుటచేత (ఆత్మను, చిదానందాద్వితీయబ్రహ్మనుగా భావింపమిచేత), భోగయోగేన=విషయములతో కూడినవాఁడగుటచే, సమంతాత్=సర్వత్ర లేక అంతటను, ప్రవర్తతే= చొచ్చుచున్నాఁడు.

తా. ఫలకాంక్షులయి వేదోక్తకర్మల నాచరించువారు,తత్ఫలము లనుభవించుటకై జననమరణంబు లందుచు స్వర్గమర్త్యలోకములం బరిభ్రమించుచు మృత్యువు నతిక్రమింపలేరు. కర్మచే మృత్యునిరసనం బగు ననువారి

యిట్టివారు చిదానందాద్వితీయబ్రహ్మము నెఱుంగ నేరక భోగముల మీఁదియాశచేఁ గర్మఫలానురాగసంపన్నులై మృత్యునిరసనంబుఁ గాంచనేరరు. (అంధుఁడేరీతిగా నిమ్నోన్నత కంటకస్థలములందు దారిఁ గనలేక యుల్లాడునో, అదేరీతిని వివేకహీనులు విషయసుఖాపేక్షలో మునిఁగి పరమాత్మను దెలియలేరు). అని తాత్పర్యము.

తద్వై మహామోహన మిన్ద్రియాణాం
మిథ్యార్థయోగేఽస్య గతిర్హి నిత్యా,
మిథ్యార్థయోగాభిహతాన్తరాత్మా
స్మరన్నుపాస్తే విషయాన్ సమన్తాత్. ౧౦.

టీ. తత్ = ఆవిషయములయందు మునిఁగియుండుట, ఇంద్రియాణాం = ఇంద్రియములకు, మహామోహనం హి = మిక్కిలి యజ్ఞానమును జెందించునదేగదా? మిథ్యార్థయోగే = అవిద్యతో సంబంధమునందు, అస్య = వీనికి, గతిః = సంసారగతి, నిత్యాహి = నియతిగా నుండునదేగదా? మిథ్యార్థయోగాభిహతాన్తరాత్మా = అవిద్యా సంబంధముచేత నశించునట్లు కొట్టఁబడిన అన్తరాత్మ గలవాఁడై, సమన్తాత్ = ఎల్లెడలను, విషయాన్ = స్త్రీలు మొదలగు భోగాస్పదములైన విషయములనే, స్మరన్ = తలఁచుచు, ఉపాస్తే = సేవించుచుండును. (పరమాత్మ నెంతమాత్రమును తలఁపక మృత్యువు పాలై చెడును).

తా. మిథ్యార్థయోగమనగా నవిద్యతో సంబంధించుట. ఆయవిద్య ఏదియనగా శరీరమే యాత్మ యనుభావము. ఇట్టిభావమునకు లోనైనవాఁడు ఇంద్రియవ్యాపారములయందే మనస్సు నిలుపుటచేత వానియజ్ఞానము బలపడి, అంతఃకరణము స్వాభావికబ్రహ్మభావంబును మఱచి విషయాస్పదంబైన సంసారసాగరంబున నపయుచుండును. దరి కానలేఁడు. అని తాత్పర్యము.

దేహోఽప్రకాశో భూతానాం నరకోఽయం ప్రదృశ్యతే,
గృధ్యన్త ఏవ ధావన్తి గచ్ఛన్తశ్శ్వభ్రిమున్ముఖాః.

టీ. భూతానాం=క్రిమికీటకసంబంధమైన, అయం = ఈ, దేహః= దేహము, అప్రకాశః = స్పష్టముకాని, నరకః=నరకముగా, ప్రదృశ్యతే= అగపడుచున్నది. (యథా-అన్ధాః = గ్రుడ్డివారు) శ్వభ్రిం=పల్లమునుగూర్చి, లేక కూపాదికమును గూర్చి, ఉన్ముఖాః = పైనఁజూచుచు, గచ్ఛన్తఇవ = పోవువారివలె, గృధ్యన్తఏవ=అపేక్షగలవారలయ్యే, ధావన్తి = పరుగెత్తుచున్నారు.

తా. అజ్ఞానముచేత పొందఁబడి, క్రిమికీటకసంబంధమైన దేహము శ్లేష్మరక్తవిణ్మూత్రాదులతో నిండియుండుటంబట్టి కేవలనరకమునకు సమానము.అట్టి హేయంబైనస్త్రీదేహము రమణీయంబను తలంపున, దాని నత్యంతకాంక్షతో, బావిలోఁబడు నంధులమాడ్కిఁ బడయుదురు.

అమన్యమానః క్షత్త్రియ కశ్చి దన్య
న్నాధీయతే తార్ణ ఇవాస్య వ్యాఘ్రిః,
క్రోధా ల్లోభా న్మోహభయా న్తరాత్మా
స వై మృత్యు స్త్వచ్ఛరీరే య ఏషః. ౧౫

టీ. క్షత్త్రియ=ఓరాజా! కశ్చిత్ = ఒకానొకఁడు, అన్యత్= మఱొకదానిని, అమన్యమానః= బుద్ధియందు చింతసేయక, నాధీయతే=అవిషయమైన అధ్యాత్మశాస్త్రమును చదువఁడో, అస్య=వీనియొక్క అనగా నీవిషయవిషాంధునియొక్క, (దేహః=దేహము) తార్ణః వ్యాఘ్రి ఇవ=గడ్డితోఁజేయఁబడిన పులివలె, (నిరర్థకోభవతి=ప్రయోజనము లేనిదగుచున్నది.) త్వచ్ఛరీరే= నీశరీరమందు, క్రోధాత్ లోభాత్=క్రోధలోభములనుండి, మోహభయాన్తరాత్మా=మోహభయములనుపొందిన అంతఃకరణము, యః= ఏదిగలదో, ఏషః=ఈ, సః = అదియు, మృత్యుర్వై=మృత్యువుగదా.

తా. విషయవిషాంధు లధ్యాత్మశాస్త్రముఁ జదువక యాత్మతత్త్వమె ఱుంగక వనటలపాలగుదురు. వారు కామోపభోగములకు పలయుదానికంటె ఇతరమయినదానిని తెలిసికొననే లేరు. వారిదేహము తృణనిర్మితవ్యాఘ్రముచందమున నిరర్థకంబు. క్రోధలోభములతోఁగూడి విషయములందే చరించుచున్న వారియాత్మయే వారికి మృత్యువు. 'ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః' అని గీతాశాస్త్రము.

ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానేన తిష్ఠన్న బిభేతి మృత్యోః,
వినశ్యతే విషయే తస్య మృత్యుః
మృత్యోర్యథా విషయం ప్రాప్య మర్త్యః. ౧౬

టీ. ఏవం=క్రోధాదిరూపముగా, మృత్యుం=మృత్యువు (ప్రమాదాఖ్యమైన మృత్యువు) ను, జాయమానం = జన్మమెత్తుదానినిగా, విదిత్వా=(జననమరణాదిసర్వానర్థబీజమని) తెలిసికొని, జ్ఞానేన = చిత్సదానందాద్వితీయబ్రహ్మజ్ఞానముచేత, తిష్ఠన్=ఉన్నవాఁడై, ఇహ=ఇచట, మృత్యోః=మృత్యువునకు, న బిభేతి=భయపడఁడు. యథా = ఏవిధముగా, మృత్యోః=మృత్యువునకు, విషయం=సంబంధించిన సంసారమును, ప్రాప్య = పొంది, మర్త్యః=మనుష్యుఁడు, వినశ్యతే=నశించుచున్నాఁడో, (తథా = ఆదేవిధముగా) తస్య విషయే=జననమరణాది సర్వానర్థబీజమని మృత్యువునెఱిఁగి చిత్సదానందాద్వితీయబ్రహ్మజ్ఞానమునందుండు వానివిషయమునందు, మృత్యుః=మృత్యువే, వినశ్యతే=నశించును.

తా. మృత్యువు క్రోధాదులవల్ల పుట్టినదనియు, జననమరణాది సర్వానర్థబీజమనియును తెలిసి, భూతాదులను దహించు క్రోధాదిదోషముల వదలి, అక్రోధనుఁడై, చిత్సదానందాద్వితీయపరబ్రహ్మను, జ్ఞానమువల్ల తెలియువాఁడు మృత్యువునకు భయపడఁడు. పామరుఁడగువానిని మృత్యువెట్లు నశింపఁజేయునో, అట్లు అట్టిజ్ఞానియొక్క మృత్యువు తానయ్యే నశించును. అని తాత్పర్యము.

# ద్వితీయో ధ్యాయః.



ధృతరాష్ట్ర ఉవాచ.—

కస్యైష మౌనః కతరన్ను మౌనం
ప్రబ్రూహి విద్వా న్నిహ మౌనభావమ్,
మౌనేన విద్వా నుపయాతి మౌనం
కథం మునే మౌన మిహాచరన్తి. ౧

ధృతరాష్ట్ర ఉవాచ = ధృతరాష్ట్రుఁ డడుగుచున్నాఁడు.—

టీ. ఏష మౌనః=ఈమౌనము, అనఁగా వాగాద్యుపరతి లక్షణయుక్తమైనమౌనము, కస్య=ఎట్టివానికి? మౌనం=మౌనము, కతరన్ను = అసంభాషణమా లేక ఆత్మస్వరూపపరిజ్ఞానమా? ఎట్టిది? విద్వన్ = విద్వాంసుఁడా! ప్రబ్రూహి = చెప్పుము. మౌనేన=అసంభాషణము చేత, మౌనం=మౌనస్వభావమును, విద్వాన్=విద్వాంసుఁడు, ఉపయాతి(కిం)=పొందునా యేమి! మునే=మునీశ్వరుఁడా, ఇహ = ఈలోకమునందు, మౌనం=మౌనస్వభావమును, కథం=ఎట్లు, ఆచరంతి=ఆచరణచేయుచున్నారు?

తా. ఇట్టి మౌనం బెట్టివాని కలవడు? మౌనమనగ నెయ్యది? సంభాషణ లేకయుండుటయా? అట్లగునేని అందువల్ల పరబ్రహ్మత్వము సిద్ధించునా? లేక మౌనమనుట యాత్మస్వరూపపరిజ్ఞానమా? మౌనము నెట్లాచరించెదరు? అని సనత్సుజాతమహర్షిని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించెను.

సనత్సుజాత ఉవాచ.—

యతో న వేదా మనసా సహైన
మనుప్రవిశ్యన్తి తతోఽథ మౌనమ్,
యత్రోత్థితో వేదశబ్దస్తథాఽయం
స తన్మయత్వేన విభాతి రాజన్. ౨

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాత మహర్షి చెప్పుచున్నాఁడు.—

టీ. వేదాః=వేదములు, ఏనం=ఈతనిని, మనసాసహ=మనస్సుతోఁ గూడ, యతః = ఏకారణమువలన, నానుప్రవిశ్యన్తి = పొందఁజాలవో, అథ=పిమ్మట, తతః=ఆకారణమువలననే, మౌనం=మౌనమని చెప్పఁబడు చున్నది. ఆపరమాత్మ ఏలక్షణముతోనున్నాఁడో ముందు వివరింపఁ బడు చున్నది. తథా=అదేవిధముగా, రాజన్ = ఓరాజా! అయం=ఈ, వేద శబ్దః=వేదశబ్దము (శాస్త్రాదులకన్నింటికి నుత్పత్తి కాధారమైన వేదశబ్ద మనుట), యత్ర ఉత్థితః=ఏవానివల్ల పుట్టినదో, సః=వాఁడు, తన్మయత్వేన= వేదమయుఁడై, జ్యోతిర్మయుఁడై, విభాతి=ప్రకాశించుచున్నాఁడు.

వేదశబ్దము పరబ్రహ్మ నెఱుఁగుటకై పుట్టినది. సర్వశాస్త్రములును వేదార్థప్రకటనకయ్యే పుట్టినవి. అనగా సర్వవేదములకు నిమిత్తభూతుఁ డైన పరబ్రహ్మ వేదశబ్దమువలన నెఱుఁగఁదగినవాఁడు.

తా. మౌనశబ్దమునకు చిదానందస్వరూపియైన పరబ్రహ్మమని యర్థము. మనమనస్సులు పరబ్రహ్మను తెలియలేవు? వేదములు బ్రహ్మమునకు వాచకంబైయుండు. పరబ్రహ్మను తెలియుటకు ఆధారభూతంబు వేదంబు. పరబ్రహ్మ వేదమయుఁడై, జ్యోతిర్మయుఁడై ప్రకాశించు చున్నాఁడు.

ధృతరాష్ట్ర ఉవాచ.—

ఋచో యజూంష్యధీతే యస్సామవేదం చ యోద్విజః,
పాపాని కుర్వన్పాపేన లిప్యతే న స లిప్యతే. 3

ధృతరాష్ట్రఉవాచ=ధృతరాష్ట్రుఁ డడుగుచున్నాఁడు.—

టీ. యః=ఏ, ద్విజః=ద్విజుఁడు, ఋచః=ఋగ్వేదమును, యజూంషి=యజుర్వేదమును, అధీతే=చదువుచున్నాఁడో, యః=ఏవాఁడు, సామ వేదంచ=సామవేదమును (అధీతే = చదువుచున్నాఁడో), సః = అద్విజుఁడు, పాపాని=పాపములను, కుర్వన్=చేయుచు, పాపేన=పాపముచేత, లిప్యతే=అంటఁబడునా? సః=వాఁడు, న లిప్యతే=అంటఁబడఁడా?

తా. ఋగాదివేదపాఠములఁ జేయుచుండు బ్రాహ్మణుఁడు పాపములు చేయుచుండియు ఆపాపములఫలము లందునా? అందఁడా? యని ధృతరాష్ట్రుఁడు మరల ప్రశ్నఁజేసెను.

సనత్సుజాత ఉవాచ.—

నైనం సామాన్యృచో వాపి యజూంషి చ విచక్షణాః,
త్రాయన్తే కర్మణః పాపాన్న తే మిథ్యా బ్రవీమ్యహమ్.

సనత్సుజాతఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. సామాని=సామవేదమైనను, ఋచఃవా అపి=ఋగ్వేదమైనను, యజూంషి చ=యజుర్వేదమైనను, ఏనం=ఈ, విచక్షణం=విద్వాంసుని, పాపాత్=పాపమైన, కర్మణః=కార్యమునుండి, న త్రాయన్తే=రక్షింపఁజాలవు. అహం=నేను, తే=నీకు, మిథ్యా=అన్ృతమును, న బ్రవీమి=చెప్పను.

తా. ఋగ్యజుస్సామాదుల నధ్యయనముచేసియు విడివడి చేయు దుష్కార్యపాపములు కర్త విద్వాంసుఁడయ్యును తప్పక సంకటముచేయును. ఇది సత్యము. నీతో నే నన్ృతమాడను అని సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

న ఛందాంసి వృజినాత్తారయన్తి
మాయావినం మాయయా వర్తమానమ్,
నీడం శకున్తా ఇవ జాతపక్షా
శ్ఛందాంస్యేనం ప్రజహాంత్యన్తకాలే. ౫

టీ. ఛందాంసి=వేదములు, మాయావినం=మాయావియు అనగా ప్రతిష్ఠకు ధర్మధ్వజిగానుండువాఁడును, మాయయా=మిథ్యాచేతననగా మోసముచేత, వర్తమానం=ఆచరించువాఁడును, అగు, ఏనం=వీనిని, వృజినాత్=పాపములనుండి, న తారయన్తి=రక్షింపఁజాలవు. (యథా=ఏరీతిఁగా) జాతపక్షాః=ఱెక్కలువచ్చిన, శకున్తాః=పక్షులు, నీడం ఇవ=గూఁటినివలె, అంతకాలే=మరణకాలమునందు, ఛందాంసి=వేదములు, ఏనం=వీనిని (ఈధర్మధ్వజిని), ప్రజహాతి=త్యజించుచున్నవి.

తా. ఱెక్కలు వచ్చినపక్షులు ఏరీతిఁగా తమగూఁటిని వదలిపోవునో ఆరీతిఁగా అధర్మములఁజేయుచుండు వేదాధ్యాపకుఁడైన నాస్తికుని, డాంబికునిగా గ్రహించి వానిమరణకాలమునందు వాఁ డధ్యయనము చేసిన వేదములు వానిని రక్షింపవు. తమంతట నవే వదలిపోవును.

ధృతరాష్ట్ర ఉవాచ.—

న చేద్వేదా వేదవిదం త్రాతుం శక్తా విచక్షణ,
అథ కస్మాత్ప్రలాపోఽయం బ్రాహ్మణానాం సనాతనః.

ధృతరాష్ట్రఉవాచ=ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. విచక్షణ = విద్వాంసుఁడవగు ఓమహర్షీ! వేదాః = వేదములు, వేదవిదం = వేదముల నెఱిఁగినవానిని, త్రాతుం = తరింపఁజేయుటకు, శక్తాః = సామర్థ్యముగలవి, న చేత్=కానియెడల, అథ=పిమ్మట, బ్రాహ్మణానాం = విప్రులయొక్క, సనాతనః = ప్రాచీనమయిన, అయం ప్రలాపః=ఈదబ్బరమాట, అనగా (వేదాధ్యయనము, తదర్థవిచారము, తదర్థానుష్ఠానంబుఁ గర్తవ్యంబనునది,) కస్మాత్ = ఎందుకు చెల్లును ?

తా. వేదంబులు వేదవిత్తుం బరిరక్షింపఁ జాలవేని, ప్రాచీనముగా విప్రులు చేయు వేదాధ్యయనము, తదర్థవిచారము, తదర్థానుష్ఠానంబు కర్తవ్యం బను నీమాటలన్నియు దబ్బరమాటలేనా? యని ధృతరాష్ట్రుండు సనత్సుజాతుని నడిగెను.

సనత్సుజాత ఉవాచ.—

తస్యైవ నామాది విశేషరూపై
రిదం జగద్భాతి మహానుభావ,
నిర్దిశ్య సమ్యక్ప్రవదన్తి వేదా
స్తద్విశ్వవైరూప్య ముదాహరన్తి. ౭

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. మహానుభావ = మహానుభావుఁడగు ఓధృతరాష్ట్రుఁడా! తస్య = పరమాత్మయొక్క, నామాదివిశేషరూపైః ఏవ = మాయాకల్పిత

మైన నామరూపాది విశేషరూపములచేతనే, ఇదం= ఈ, జగత్ = ప్రపంచము, భాతి = ప్రకాశించుచున్నది. వేదాః = వేదములు, తత్ = దానిని, సమ్యక్ = లెస్సగా, నిర్దిశ్య = బహురూపమనియు మాయానిర్మిత మనియు నిర్దేశించి, ప్రవదన్తి = చెప్పుచున్నవి. తత్ = అపరబ్రహ్మను, విశ్వవైరూప్యం = ప్రపంచమునకంటె విపరీతమైనదానినిగా, ఉదాహరన్తి = చెప్పుచున్నవి.

తా. మాయాకల్పితములైన నామాది విశేషరూపములచే నీజగ మొప్పియున్నదిగాని వేఱుగాదు. ఈవిషయము వేదములవలనను వేదవిత్తులగు మునులవలనను స్పష్టంబయ్యెడి. పరమేశ్వరునిరూపము జగత్తునకంటె విపరీతమైనదిగా పలుకుచున్నారు. కావున వేదాధ్యయనముచేసి, పరమాత్మ ధ్యానమును లెస్సగా నొనరించుటయే ప్రయోజనముగాని అన్య ముపయోగము కానరాదు.

తదర్థముక్తం తప ఏత దిజ్యా
తాభ్యామసౌ పుణ్య ముపైతి విద్వాన్,
పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్
స జాయతే జ్ఞానవిదీపితాత్మా. ౨
జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వాన్
నచాన్యథా వర్గఫలానుకాఙ్క్షీ,
అస్మిన్కృతం తత్పరిగృహ్య సర్వం
అముత్ర భుఙ్క్తే పునరేతి మార్గమ్. ౩

టీ. ఏతత్=ఈ, తపః=కృచ్ఛ్రచాంద్రాయణాదుల నాచరించుతపస్సు, తదర్థం=అపరబ్రహ్మ నిమిత్తమని, ఉక్తం=చెప్పఁబడినది. ఇజ్యా=జ్యోతిష్టోమాది యజ్ఞంబును అపరబ్రహ్మ నిమిత్తమనియే, తాభ్యాం=ఆతపోయజ్ఞములచేత, పుణ్యం=పుణ్యమును, ఉపైతి=పొందుచున్నాఁడు. సః=వాఁడు, పుణ్యేన=పుణ్యముచేత, పాపం = పాపమును, వినిహత్య=పోఁగొట్టుకొని, జ్ఞానవిదీపితాత్మ = జ్ఞానముచేఁ బ్రకాశించు చిత్సదానం

దాద్వితీయపరబ్రహ్మ స్వరూపముగలవాఁడుగా, జాయతే=అగుచున్నాఁడు.

టీ. కించ=మఱియు, విద్వాన్=విద్వాంసుఁడు, ఆత్మానం=పరమాత్మను, జ్ఞానేన=జ్ఞానముచేత, ఉపైతి=పొందుచున్నాఁడు. అన్యథా=వేఱుమార్గముగుఁడా, వర్గఫలానుకాంక్షీ= ఇంద్రియఫలములను కోరునట్టివాఁడు, అనగా స్వర్గఫలాదులను కోరునట్టివాఁడు, అస్మిన్ (లోకే) = ఈలోకమునందు, కృతం=చేయఁబడిన, తత్=ఆయజ్ఞాదికమును, పరిగృహ్య=గ్రహించి, సర్వం=సమస్తమును, అముత్ర=పరలోకమునందు, భుక్త్వా = అనుభవించును. పునః=మరల, మార్గం=సంసారమార్గమును, ఏతి=పొందుచున్నాఁడు.

తా. కృచ్ఛ్రిచాంద్రాయణాదిరూపంబైన తపస్సును, జ్యోతిష్టోమాదియజ్ఞాచరణంబు నీశ్వరప్రీణనార్థంబనియే వేదమతంబు. అట్లు కర్మముల నాచరించు నతండు తన్మహిమమునఁ బ్రాప్తపుణ్యుండై పాపముఁ బోఁగొట్టి జ్ఞానప్రకాశిత చిత్సదానందాద్వితీయబ్రహ్మస్వరూపుఁడగును. కావున వేదోక్తవిధి నాచరించుటవలన శ్రేయస్సు కలదు. కేవల వేదాధ్యయనమువలన శ్రేయస్సు లేదు.

వేదోక్తవిధిప్రకారముల నాచరించువాఁడు జ్ఞానియై పరమాత్మస్వరూపసాక్షాత్కారమును గాంచును. అట్లుగాక స్వర్గాదిఫలాపేక్షాబుద్ధితోఁ గర్మముల నాచరించువాఁడు సంపాదితపుణ్యఫలంబుతో స్వర్గంబున కేగి, పుణ్యసమాప్తికాఁగా మఱల నీలోకమునుబొంది జననమరణాదిరూపమగు సంసారచక్రంబునంబడి అజ్ఞానియై పరిభ్రమించుచుండును.

అస్మిన్ లోకే తపస్తప్తం ఫలమన్యత్ర భుజ్యతే,
బ్రాహ్మణానాం తపస్స్వృద్ధమన్యేషాం తావదేవ తత్. ౧౦

టీ. అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, (యత్) తపః=(ఏ) తపస్సు, తప్తం=ఆచరింపఁబడుచున్నదో, (తస్య) ఫలం=(ఆతపః) ఫలము, అన్యత్ర=పరలోకమునందు, భుజ్యతే=అనుభవింపఁబడుచున్నది. (ఇది జ్ఞానులును అజ్ఞానులును సమానులే.) బ్రాహ్మణానాం=బ్రహ్మవేత్తలయొక్క, తపః=తపస్సు, వృద్ధం = అతిసమృద్ధిని పొందుచున్నది. ఫలవృద్ధి హేతువు

గలది యగుచున్నది. అన్యేషాం = ఇతరులయొక్క, బ్రహ్మవేత్తలుకాని వారియొక్క, అనాత్మవిదులయొక్క, అజ్ఞానులయొక్క, తత్ = ఆతపస్సు, తావదేవ=సమృద్ధికానేరదు. ఎంతయొనర్చెదరో అంతయే ఫలమగుచున్నది.

తా. బ్రహ్మజ్ఞానులును తదితరులును ఈలోకంబున నొనర్చిన తపః ఫలంబును పరలోకంబున ననుభవించెదరు. బ్రహ్మజ్ఞానితపం బత్యంతఫలవంతంబగు. ఫలకాలంబున సమృద్ధి నడయు. అజ్ఞాని తానెంత తపంబొనర్చునో అంతియ ఫలప్రాప్తిఁ జెందు. బ్రహ్మజ్ఞానితపంబు మోక్షదంబగు. అజ్ఞానితపంబు స్వర్గాదిసుఖదంబగు.

ధృతరాష్ట్ర ఉవాచ.—

కథం సమృద్ధ మత్యర్థం తపో భవతి కేవలమ్,
సనత్సుజాత తద్బ్రూహి కథం విద్యా మహం ప్రభో. ౧౧

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు అడుగుచున్నాఁడు —

టీ. తపః=తపస్సు, సమృద్ధం=సమృద్ధినొందినదియు, అత్యర్థం=అధిక ప్రయోజనముఁ గలదియు, కేవలం=కేవలమయినదియు, కథం భవతి=ఎట్లగుచున్నది. సనత్సుజాత =ఓ సనత్సుజాత మహర్షీ! అహం= నేను, కథం= ఏరీతిఁగా, విద్యాం= తెలిసికొందునో, తత్ =దానిని, బ్రూహి=చెప్పుము.

తా. "తపస్సు సమృద్ధము, అత్యర్థము, కేవలమెట్లగును? ఓమహర్షీ! దీనిని నేనెట్లు తెలిసికొందునో వివరించి నుడువు" మని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించెను.

సనత్సుజాత ఉవాచ.—

నిష్కల్మషం తపస్త్వేతత్ కేవలం పరిచక్షతే,
ఏతత్సమృద్ధ మత్యర్థం తపో భవతి నాన్యథా. ౧౨

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు —

టీ. నిష్కల్మషం=కల్మషములేని, ఏతత్=ఈ, తపః = తపస్సును, కేవలం=కేవలమని,జగత్తునకు బీజమని, పరిచక్షతే=చెప్పుచున్నారు.ఏతత్=

ఈ, కేవలం=కేవలమయిన, తపః = తపస్సే, సమృద్ధం = సమృద్ధినిఁ జెందినదియు, అత్యర్థం=విశేషమైన ఫలవంతంబును, భవతి=అగుచున్నది.

తా. నిష్కల్మషంబైన తపస్సు కేవలం బనంబరఁగు. అదియ యత్యంత ఫలవంతంబగు. ఏలయన, బీజమెట్లు అత్యంతఫలవంతంబో అట్లే కేవలంబైన తపస్సును ఫలవంతంబు.

తపోమూలమిదం సర్వం యన్మాం పృచ్ఛసి క్షత్రియ,
తపసా వేద విద్వాంసః పరం త్వమృత మాప్నుయుః. ౧౩

టీ. క్షత్రియ = ఓరాజా! మాం=నన్ను, యత్=దేనిని, పరిపృచ్ఛసి=అడుగుచున్నావో, ఇదం సర్వం=ఇదియంతయు, తపోమూలం= తపస్సునకు మూలము; విద్వాంసః=విద్వాంసులు, తపసా ఏవ=తపస్సు చేతనే, పరం అమృతం=శ్రేష్ఠమైన యమృతత్వమును, ఆప్నుయుః=పొందుదురు.

తా. "ఓరాజా! సర్వంబును తపోమూలంబు; తపస్సుననే వేదవిత్తులందఱును అమృతత్వంబును, మోక్షమును గాంచిరి." అని సనత్సుజాతుండు ధృతరాష్ట్రునకుఁ జెప్పెను.

ధృతరాష్ట్ర ఉవాచ.—

కల్మషం తపసో బ్రూహి శ్రుతం నిష్కల్మషం తపః,
సనత్సుజాత యేనేదం విద్యాం గుహ్యం సనాతనమ్. ౧౪

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. సనత్సుజాత = సనత్సుజాతమహర్షీ! తపః=తపస్సు, నిష్కల్మషం=కల్మషరహితమయినదని, శ్రుతం = వినఁబడినది. తపసః=తపస్సుయొక్క, కల్మషం=కల్మషమెయ్యది, బ్రూహి=వక్కాణింపుము. యేన=ఏ నిష్కల్మషమైన తపస్సుచేత, అహం=నేను, సనాతనం=ప్రాచీనమైనది అగు, ఇదం=ఈ, గుహ్యం=రహస్యమును, బ్రహ్మరహస్యమును, విద్యాం=తెలిసికొందునో, తెలిసికొనఁ గోరుచున్నాననుట.

తా. "ఓమహర్షీ! తపస్సు నిష్కల్మషముగనుండవలయు నంటివి తపస్సున కంటెడు కల్మషం బెద్ది? ఏది లేకుండిన తపంబు నిష్కల్మషం

బనంబడును? నీవల్ల పురాతనమును రహస్యమును అగు తపః కల్మషములను తెలిసికొనఁ గోరుచున్నాను." అని ధృతరాష్ట్రుఁడు సనత్సుజాతుని నడిగెను.

సనత్సుజాత ఉవాచ.—

క్రోధాదయో ద్వాదశ యస్య దోషా
స్తథా నృశంసాని చ సప్త రాజన్,
జ్ఞానాదయో ద్వాదశ చాతతానా
శ్శాస్త్రే గుణా యే విదితా ద్విజానామ్. ౧౫

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. రాజన్=ఓరాజా! యస్య=ఏతపస్సునకు, క్రోధాదయః=క్రోధము మొదలయిన, ద్వాదశ=పండ్రెండును, తథా=అదేవిధముగ, సప్త=ఏడైన, నృశంసానిచ=నృశంసములును, క్రౌర్యములని భావము. దోషాః=దోషములో; తతానాః=విస్తారములయిన, జ్ఞానాదయః=జ్ఞానము మొదలయినవి, ద్వాదశ=పండ్రెండును, ద్విజానామ్=బ్రాహ్మణులకు, గుణా ఇతి=వ్రతములని, శాస్త్రే=వేదశాస్త్రమునందు, విదితాః=చెప్పఁబడినవి.

తపస కల్మషములు క్రోధాదులగు ౧౨ ను, నృశంసాదులగు ౭ ను అయియున్నవి. ఇవి దోషములు. తపోగుణములు జ్ఞానాదులగు ౧౨ ను ఈ గుణదోషములను విస్తరించి నీకు చెప్పెదనని సనత్సుజాతమహర్షి ధృతరాష్ట్రునకు చెప్పెను.

క్రోధః కామో లోభ మోహౌ వివిత్సాఽ
కృపాఽసూయా మానశోకౌ స్పృహాచ,
ఈర్ష్యా జుగుప్సా చ మహాగుణేన
సదా వర్జ్యా ద్వాదశైతే నరేణ. ౧౬

టీ. మహాగుణేన = గొప్పగుణముగల, నరేణ=నరునిచేత - బ్రాహ్మణునిచేత, క్రోధః = క్రోధము, కామః = కామము, లోభమోహౌ = లోభమోహములు, వివిత్సా=విషయరసాదులనెఱుఁగ నిచ్ఛ, అకృపా=

నిష్ఠురత, అసూయా = అసూయ, మానశోకౌ = మానము శోకము, స్పృహా చ = విషయభోగేచ్ఛ, ఈర్ష్యా = పరశ్రేయస్సునందలి యసహిష్ణుత్వము, జుగుప్సా = జుగుప్స, ఏతే = ఈ, ద్వాదశ = పండ్రెండుదోషములు, సదా = ఎల్లప్పుడు, వర్జ్యాః = వదలిపెట్టఁదగినవి.

తా. క్రోధాదులగు ద్వాదశమహాదోషములను తపస్వి యెల్లప్పుడును వదలి యుండవలసిన దని తాత్పర్యము.

1. క్రోధము=కామప్రతిఘాతమునఁ గలుగు చిత్తవిక్షేపము - తాను కోరినకోరికకు ప్రతిబంధకము తటస్థించిన నప్పుడు జనించు దుర్గుణవిశేషము.

2. కామము = స్రక్చందన వనితాదులమీఁది యభిలాష.

3. లోభము = పరద్రవ్యేచ్ఛ, లేక, న్యాయార్జిత ద్రవ్యము నుత్తమపాత్రమునం దర్పింపమి.

4. మోహము = కార్యాకార్యవివేకము లేకపోవుట.

5. వివిత్స = విషయరసముల నెఱుంగఁగోరుట - దీనిని విదిత్సయని కొందఱు.

6. అకృప = నిష్ఠురత్వము, లేక, కఠినత్వము.

7. అసూయ = గుణములయందు దోషారోపణమును, పరగుణముల సైరింపఁజాలమియు.

8. మానము = ఆత్మబహుమానము; తన్ను గౌరవించుకొనుట.

9. శోకము = ఇష్టమైనదాని నెడఁబాసినఁ గలుగు చిత్తక్షోభము.

10. స్పృహ = విషయభోగకాంక్ష.

11. ఈర్ష్య = పరులమేలోర్వమి.

12. జుగుప్స. = పరుల సుగుణములను గప్పి పుచ్చఁగఁదలంపు. దీనిని బీభత్సమనియు కొందఱు.

ఏకైకమేతే రాజేన్ద్ర మనుష్యం పర్యుపాసతే,
లిప్సమానో౽న్తరం తేషాం మృగాణామివ లుబ్ధకః. ౧౭

# సంస్కృతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్నగ్రంథమునకు తెనుఁగు. | ... | 0 | 2 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 4 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము, చక్కనిప్రతి | ... | 0 | 5 |
| కేరళప్రశ్నము, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | | 0 | 3 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 2 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 4 |
| వివేకచూడామణి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 10 |
| హరిమీడేస్తోత్రము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 3 |
| ఆత్మబోధము ,, ,, | ... | 0 | 4 |
| సౌందర్యలహరి ,, ,, | ... | 0 | 8 |
| శివానందలహరి, సంస్కృతాంధ్రటీకాసహితము, చక్కనికూర్పు | | 0 | 8 |
| రామగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు, మంచికాగితములు | ... | 0 | 6 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు | ... | 0 | 4 |
| భగవద్గీతలు, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యసహితము, మతత్రయ భాష్యములనుండి అనేక అంశము లిందు వ్రాయఁబడియున్నవి. అకారాది అనుక్రమణికతో చక్కగ ముద్రింపఁబడినది. | ... | 2 | 0 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | | 1 | 0 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చిన్నసైజు | | 0 | 6 |
| భగవద్గీతలు, చిన్నసైజు, శ్రీఆనిబిసెంటుగారి ఇంగ్లీషు తర్జుమాసహితము | | 0 | 4 |
| సర్వసారోపనిషత్తు, ఆంధ్రతాత్పర్యసహితము, చిన్నసైజు | | 0 | 2 |
| నిరాలంబోపనిషత్తు ,, | ... | 0 | 1 |
| కైవల్యోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| అమృతబిందూపనిషత్తు ,, | ... | 0 | 1 |

# సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి రు. | ఆ. |
|---|---|---|
| స్కాందోపనిషత్తు, ఆంధ్రతాత్పర్య సహితము, చిన్నసైజు ... | 0 | 1 |
| ఆత్మబోధోపనిషత్తు ,, ... | 0 | 2 |
| శారీరకోపనిషత్తు ,, ... | 0 | 1 |
| భాషామంజరి, సటీక, చక్కనికూర్పు ... | 0 | 4 |
| రఘువంశము, 6 సర్గలు, పదచ్ఛేదము, అర్థము, ఆకాంక్షా శబ్దసమాసతాత్పర్యవ్యాఖ్యానసహితము, సాధారణప్రతి | 3 | 8 |
| డిటో మేలు ప్రతి ... | 5 | 0 |
| రఘువంశము, 10 సర్గలు సవ్యాఖ్యానము ... | 0 | 8 |
| మేఘసందేశము, సంస్కృతాంధ్రవ్యాఖ్యాన సహితము ... | 0 | 12 |
| చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| పుష్పబాణవిలాసము, సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము | 0 | 4 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | 0 | 10 |
| కుమారసంభవము, సంస్కృతాంధ్ర టీకాతాత్పర్యసహితము | 1 | 4 |
| మాఘము, సవ్యాఖ్యానము, 6 సర్గలు చక్కనికూర్పు ... | 0 | 10 |
| మాఘము, 3 సర్గలు, శబ్దసమాసతాత్పర్య సంస్కృతాంధ్ర వ్యాఖ్యానసహితము ... | 2 | 0 |
| నైషధము, సవ్యాఖ్యానము, 6 సర్గలు, చక్కనికూర్పు | 0 | 12 |
| విక్రమార్కచరిత్ర, ఆంధ్రటీకాసహితము చక్కనికూర్పు | 0 | 14 |
| భర్తృహరిసుభాషితము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము మేలు కాగితములు, అట్టబైండు ... | 0 | 1 |
| బిల్హణచరిత్ర, సటీక చక్కనికూర్పు ... | 0 | 6 |
| లింగానుశాసనము... | | |

వావిళ్ల. రామస్వామిశాస్త్రిలు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

టీ. హేరాజేన్ద్ర = ఓరాజశ్రేష్ఠుఁడా! మృగాణాం = మృగముల యొక్క, అన్తరం = ఛిద్రమును, లిప్సమానః = కోరెడు, లుబ్ధక ఇవ= (రంధ్రాన్వేషణపరుఁడగు) వేఁటకానివలె, ఏతే=ఈక్రోధాదులు, తేషాం =తపసేచ్ఛగల మనుష్యులయొక్క, అన్తరం = అవకాశమును అనగా కాల దేశవర్తనముల నెఱింగి, మనుష్యం=నరుని, ఏకైకం=ప్రత్యేకప్రత్యేకముగా, పర్యుపాసతే = ఆశ్రయించుచున్నవి.

తా. వేఁటకాఁడు సందు చూచుకొని మృగాదుల హింసించుచా డ్పున ప్రత్యేకప్రత్యేకముగా క్రోధాదిద్వాదశగుణములును మనుష్యు ననుసరించి యుండి తరివేచి నాశనమొనర్చును, లేక హింసించును.

సంభోగసంవి ద్విష మేధమానో
దత్తానుతాపీ కృపణోఽబలీయాన్,
వర్గప్రశంసీ వనితాం చ ద్వేష్టా
ఏతే పరే సప్త నృశంసరూపాః. ౧౮

టీ. సంభోగసంవిత్ = విషయసంభోగము నందాసక్తిగలవాఁడు (విషయమనఁగా స్రక్చందన వనితాదులు), విషం ఏధమానః= విషము వలె ఇతరులకు చెఱుపుచేసి వృద్ధిఁబొందువాఁడు – లేక (ద్విషమేధమానమని యుండగలదు=అనగా శత్రుత్వము కలుగఁజేసి దానివలన జీవించువాఁడనుట యును), దత్తానుతాపీ = ఎవఁడైతే పూర్వము ధర్మబుద్ధితో ధనాదికము నిచ్చి, వెనుక ఎందు కీదానముచేసితినని ఏగచుచు పరితపించువాఁడు. కృపణః=స్వల్పార్థలాభమునకై యెంతటి యవమానమును సహించువాఁడు. అబలీయాన్ = జ్ఞానబలములేనివాఁడు, వర్గప్రశంసీ = ఇంద్రియ సమూహము ను ప్రశంసించువాఁడు, వనితాం చ ద్వేష్టా=పతివ్రతయగు భార్యను ద్వేషించువాఁడు, ఏతే = ఈ, సప్త = ఏడుగురును, నృశంసరూపాః = క్రౌర్య స్వరూపు లని చెప్పఁబడుదురు.

తా. స్రక్చందనవనితాదిసుఖభోగాసక్తుఁడు, పరులకు హానిచేసిజీవించువాఁడు (లేకశత్రుత్వము పుట్టించి జీవించువాఁడు), ఇచ్చివగచువాఁడు,

లోభబుద్ధిఁజేసి యత్యంతాల్పలాభమునకై యెంతటి యవమానమునైనను సహించువాఁడు, బుద్ధిబలములేనివాఁడు, ఇంద్రియవ్యాపారమునకు లోఁబడినవాఁడు, పతివ్రతయగుభార్యను ద్వేషించువాఁడు, ఈఏడుగురును నృశంసులని చెప్పఁబడుదురు.

జ్ఞానం చ సత్యం చ దమశ్శ్రుతం చ
అమాత్సర్యం హ్రీ స్తితిక్షాఽనసూయా,
యజ్ఞశ్చ దానం చ ధృతి శ్శమశ్చ
మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య. ౧౯

టీ. జ్ఞానం చ=తత్త్వార్థమును తెలిసియుండుట, సత్యం చ=భూతహితార్థమైన యథార్థసంభాషణము, దమః=మనోదమనము, శ్రుతం=అధ్యాత్మశాస్త్ర శ్రవణము, అమాత్సర్యం = మత్సరములేకుండుట, హ్రీః=అకార్యకరణమునందులజ్జ, తితిక్షా=సుఖదుఃఖాదులయిన ద్వంద్వసహిష్ణుత్వము, అనసూయా=పరదోషముల ప్రకటింప కుండుట, యజ్ఞః చ = అగ్నిష్టోమాది మహాయజ్ఞము, దానం చ=విప్రులకు ధనాదిక మిచ్చుట, ధృతిః = భోగాదుల సన్నిధియందు ఇంద్రియ నిగ్రహము, శమః = అంతఃకరణనిగ్రహము, బహిఃకరణనిగ్రహమని ఒకానొకండు, ఏతే = ఈ, ద్వాదశ=జ్ఞానాదులైన పండ్రెండు గుణములును, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునకు, మహావ్రతాః = పరపురుషార్థసాధనభూతములైన గొప్ప వ్రతములు.

తాత్పర్యము సుగమము. పరమపురుషార్థసాధనమైన యీ ద్వాదశగుణములు తప్ప బ్రాహ్మణున కనుష్ఠింపఁ దగిన దేదియు లేదు. ఇవియే బ్రాహ్మణుని బ్రహ్మత్వసిద్ధికి ముఖ్యసాధనంబులు.

య స్త్వేతేభ్యోఽ ప్రవసే ద్ద్వాదశభ్య
స్సర్వా మిమాం పృథివీం స ప్రశిష్యాత్,
త్రిభి ర్ద్వాభ్యా మేకతో వా విముక్తాః
క్రమా ద్విశిష్టా మానభూతా భవన్తి. ౨౦

టీ. యః తు=ఏవాఁడైనను, ఏతేభ్యః=ఈ, ద్వాదశేభ్యః=ద్వాదశగుణములనుండి, అప్రవసేత్=విడువఁబడఁడో, సః=వాఁడు, ఇమాం = ఈ, సర్వాం = సమస్తమైన, పృథివీం=భూమిని, ప్రశిష్యాత్=తనవశము చేసికొనును; త్రిభిః=మూటిచేతనైనను, ద్వాభ్యాం=రెంటిచేతనైనను, ఏకతో వా=ఒకదానిచేతఁగాని, అవిముక్తాః=వదలిపెట్టఁబడినవారు, క్రమాత్=క్రమేణ, దినములపేర, విశిష్టాః=జ్ఞానులై, మానభూతాః=బ్రహ్మభూతులు, భవన్తి=అగుచున్నారు.

తా. క్రిందిశ్లోకోదాహృతములయిన ద్వాదశగుణము లెవ రలవాటు చేసికొందురో, వారు చరాచరాత్మకమైన పృథివిని తమవశమున నుంచుకొనఁగలరు. లేక, ఈ ౧౨ గుణములలో నేదైనను ఒకటి, రెండు, మూఁడు గుణములను గలవారైనను జ్ఞానాధిక్యముంజేసి దినములపేరట వృద్ధి పొందిబుషు లగుదురు.

దమోఽష్టాదశదోషస్స్యాత్ప్రాతికూల్యం కృతే భవేత్,
అనృతం పైశునం తృష్ణా ప్రాతికూల్యం తమోఽరతిః. ౨౧
లోకద్వేషోఽభిమానశ్చ వివాదః ప్రాణిపీడనమ్,
పరివాదోఽతివాదశ్చ పరితాపోఽక్షమాఽధృతిః. ౨౨
అసిద్ధిః పాపకృత్యం చ హింసా చేతి ప్రకీర్తితాః,
ఏతైర్దోషై ర్వియుక్తో యః స దమస్సద్భి రుచ్యతే. ౨౩

టీ. దమః=దమము, అష్టాదశదోషః = పదునెనిమిదిదోషములతోఁగూడినది, స్యాత్=అగుచున్నది. యస్మిన్=ఏదోషమైనను, కృతే సతి=చేయఁబడిన దగుచుండఁగా, ప్రాతికూల్యం=అభ్యంతరము, భవేత్=అగుచున్నది. ఏయొకదోషమైనను చేయఁబడినపక్షమున దమమునకు నిరోధము కలుగుచున్నదని స్పష్టార్థము. (1) అనృతం=అబద్ధమాడుట, (2) పైశునం=పరదూషణవచనము - కొండెములు చెప్పుట, (3) తృష్ణా = విషయాభిలాష, (4) ప్రాతికూల్యం = అన్నిటియందు ప్రతికూలుఁడుగ నుండుట, (5) తమః =

అజ్ఞానము, (6) అరతిః = యథాలాభమును పొందియు నసంతుష్టి, లేక స్త్రీభోగాదులందు అభిరతి, (7) లోకద్వేషః = లోకముతో పగ, (8) అభిమానః = అన్నిటి యందును నప్రభావము లేకుండుట, (9) వివాదః = జనకలహాచరణము, (10) ప్రాణి పీడనమ్ = స్వదేహపోషణమునకై ప్రాణులను హింసించుట, (11) పరివాదః = సమక్షమున పరదూషణము, (12) అతివాదః=నిరర్థకముగా నతిప్రలాపము, (13) పరితాపః = వృథాదుఃఖచిన్తనము, (14) అక్షమా=కష్టసుఖముల నేమాత్రము సహింపలేకపోవుట, (15) అధృతిః=ఇంద్రియార్థమైన చపలత, (16) అసిద్ధిః=ధర్మజ్ఞాన వైరాగ్యములు లేకపోవుట, (17) పాపకృత్యం = ప్రతిషిద్ధాచరణము, లేక పాపకార్యము లొనర్చుట, (18) హింసా=హాస్య, ఇతి = దమదోషము లని, ప్రకీర్తితాః= చెప్పఁబడినవి. ఏతైః=ఈ, దోషైః=దోషములచేత, యః=ఏది,విముక్తః= వదలి పెట్టఁబడినదో, సః=అదియ, సద్భిః=సత్పురుషులచేత, దమః = దమమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. దమమునకు పై నుదాహరింపఁబడిన అష్టాదశదోషము లాపాదించును; పైదోషములలో నొక్కటైనను లేనిది దమ మనంబడును.

మదోఽష్టాదశదోషస్స్యాత్ త్యాగో భవతి షడ్విధః,
విపర్యయాస్స్మృతా ఏతే మదదోషా ఉదాహృతాః. ౨౮

టీ. మదః=మదము, అష్టాదశదోషః=పదునెనిమిది దోషములు గలది, స్యాత్=అగుచున్నది. త్యాగః=త్యాగము, షడ్విధః = ఆఱువిధములు గలది, భవతి=అగుచున్నది. విపర్యయాః = విరోధభూతములుగా, స్మృతాః= చెప్పఁబడిన,ఏతే=ఈదమదోషములే, మదదోషే=మదదోషములని,ఉదాహృతాః= ఉదాహరింపఁ బడినవి.

తా. మదవినాశకరములగు గుణములు దమదోషములగు అసత్యాదులగు పదునెనిమిదింటికి వ్యతిరిక్తములు. అవియేవనగా, (1) సత్యము, (2) అపైశున్యము, (3) అతృష్ణ,(4) అప్రాతికూల్యము, (5) అతమస్సు,(6) యథాలాభ

సంతుష్టి, (7) లోకాద్వేషము, (8) అనభిమానము, (9) అవివాదము, (10) ప్రాణులయపీడనము, (11) పరదూషణాతత్పరత, (12) అనతివాదము, (13) అపరితాపము, (14) క్షమ, (15) ధృతి, (16) సిద్ధి, (17) పాపకార్యము లొనర్పమి, (18) అహింస అని తెలియనగు.

శ్రేయాంస్తు షడ్విధ స్త్యాగ స్తృతీయ స్తత్ర దుష్కరః,
తేన దుఃఖం తరన్త్యేవ తస్మిం స్త్యక్తే జితం భవేత్. ౨౫

టీ. షడ్విధః=ఆఱువిధములగు, త్యాగః=త్యాగము, శ్రేయాన్ = శ్రేష్ఠము, తృతీయః=(వానిలో) మూడవది, దుష్కరః భవేత్ = కష్టసాధ్యమగుచున్నది. తేన=దానిచేత (మూడవది యగుత్యాగముచేత), దుఃఖం=ఆధ్యాత్మికాది భేదభిన్నమగు దుఃఖమును, తరన్తి ఏవ=దాఁటుచున్నారు. తస్మిన్=ఆత్యాగము, కృతే=చేయఁబడినది కాఁగా, (సర్వం=సర్వమును) జితం (భవేత్) =జయింపఁబడినది (అగుచున్నది).

అర్హతేఽయాచమానాయ పుత్త్రాన్విత్తం దదాతి యత్,
ఇష్టాపూర్తం ద్వితీయం స్యాత్ నిత్యం వైరాగ్యయోగతః.
కామత్యాగశ్చ రాజేన్ద్ర స తృతీయ ఇతి స్మృతః,
అప్రమాదీ భవే దేతై స్స చాష్టగుణో మతః. ౨౬

టీ. రాజేన్ద్ర = రాజశ్రేష్ఠుఁడా! అయాచమానాయ = యాచింపనివాఁడైన, అర్హతే = యోగ్యునకు, పుత్త్రాన్=పుత్త్రులను, విత్తం=విత్తమును, దదాతి ఇతి=యిచ్చుచున్నాఁడనునది, యత్=ఏదిగలదో ; యీరెండును త్యాగషట్కములో ప్రథమము. నిత్యం=ఎల్లప్పుడును, వైరాగ్యయోగతః = విరక్తిచేత ధనాదిపరిత్యాగసంబంధముఁగల, ఇష్టాపూర్తే = ఇష్టాపూర్తములు దేవతల కర్పింపఁబడినది ఇష్టమనియు, పూర్తం=(పితరుల కర్పింపఁబడినది పూర్తమనియు కొందఱిమతము) శ్రౌతకర్మలయందును, స్మార్తకర్మలయందును చేయఁబడు దానములు, ద్వితీయం=రెండవ త్యాగము, స్యాత్=అగుచున్నది. కామత్యాగః=వైరాగ్యముతో కామమును త్యాగముచేయుట, సః = అది,

తృతీయః=మూడవదియగు త్యాగమని, స్మృతః=చెప్పఁబడి యున్నది. ఏతైః =వీనితో (కూడుకొన్నవాఁడై), అప్రమాదీ=ప్రమాదము లేనివాఁడు, భవేత్ =అగుచున్నాఁడు. సః=అట్లు అప్రమాదియై యుండుటయు, అష్టగుణః=ఎనిమిది గుణములతోఁగూడియుండినదైన,మతః=అభిప్రాయముగలదై యున్నది.

తా. త్యాగముయొక్క షడ్విధములలో నిందు మూఁడే చెప్పఁబడి యున్నవి.

1. పాత్రభూతుఁడైన యయాచకునకు పుత్త్రాదుల నేనియు నొసంగుట.
2. విరాగతాత్పర్యంబున నిష్టాపూర్తముల నొనర్చుట.
3. కామత్యాగంబు మూఁడవది.

మూఁడవది యగు కామత్యాగము ఎనిమిది సద్గుణములతో కూడినది అని తాత్పర్యము.

సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్యమేవచ,
అస్తేయో బ్రహ్మచర్యం చ తథాఽసంగ్రహ ఏవ చ. ౨౮

టీ. సత్యం=యథార్థసంభాషణము, ధ్యానం=ధ్యానము, సమాధానం=ప్రణవముతో విశ్వాద్యుప సంహారముఁజేసి స్వాభావికమైన సత్చిదానందాద్వితీయబ్రహ్మాత్మయందు మనస్సును లీనమైనదానిఁగాఁజేయుట, చోద్యం=వాస్తవార్థముఁగనుటకై 'నేనెవఁడను ? ఎచ్చటినుండివచ్చితిని ? ఏమిచేయువాఁడను' ఇట్టిప్రశ్నలు తనలో తానేవేసికొనుచు తర్కించుట, వైరాగ్యమేవచ = నేత్రేంద్రియవ్యాపారమువల్లను, శ్రోత్రేంద్రియవ్యాపారమువల్లను కలిగెడు ఐహికాముష్మికసుఖాదులయందు విరక్తి, అస్తేయః=శౌర్యములేకుండుట, బ్రహ్మచర్యంచ=బ్రహ్మచర్యము—అనగా మైథునవ్యాపార మేమాత్రములేకయుండుట. అవి ఎనిమిదివిధములు. (1)స్మరణము, (2) కీర్తనము, (3) కేళి, (4) వీక్షణ, (5) గుహ్యభాషణము, (6) సంకల్పము, (7) అధ్యవసాయము, (8) క్రియానిష్పత్తి. తథాచ=అదేవిధముగ, అసంగ్రహఏవచ=పుత్త్రులు, భార్య, క్షేత్రాదులయందు ఆసక్తిలేకపోవుట.

తాత్పర్యము సుగమము. పై సత్యాది ఎనిమిదిసుగుణములను అప్రమాది త్వలక్షణమని యెఱుంగునది.

ఏవం దోషా దమస్యోక్తా స్తాన్దోషా న్పరివర్జయేత్,
దోషత్యాగోఽప్రమాదస్స్యా త్సచాప్యష్టగుణో మతః.

టీ. రాజేన్ద్ర = ఓ రాజశ్రేష్ఠా! ఏవం=ఈరీతిగా, దమస్య=దమముయొక్క, దోషాః=దోషములు, ఉక్తాః=చెప్పఁబడినవి. తాన్=ఆ, దోషాన్=దోషములను, పరివర్జయేత్ = విడువవలసినది; దోషత్యాగః=దోషములయొక్క త్యాగ మేది గలదో అది, అప్రమాదః=అప్రమాదము, స్యాత్=అగుచున్నది. సచ= అదియును, అష్టగుణః = ఎనిమిదిసద్గుణములు గలదిగ, మతః=చెప్పఁబడుచున్నది.

తా. ఈరీతిఁగాఁజెప్పఁబడిన దమదోషములను వర్జింపవలయును. దోషత్యాగము అప్రమాదమనఁబడును ఈ యప్రమాదము ఎనిమిదిసద్గుణముల తోఁగూడుకొని యుండునది.

సత్యాత్మా భవరాజేన్ద్ర! సత్యే లోకాః ప్రతిష్ఠితాః,
తాంస్తు సత్యముఖానాహుః సత్యేహ్యమృత మాహితమ్.

టీ. సత్యాత్మ=సత్యస్వరూపుఁడవు, భవ=కమ్ము. సత్యే=సత్యమునందు, లోకాః=లోకములు, ప్రతిష్ఠితాః=ప్రతిష్ఠింపఁబడియున్నవి. తాన్ =ఆలోకములను, సత్యముఖాన్=సత్యమే ద్వారముగాఁగలవానిఁగా, ఆహుః=చెప్పుచున్నారు. సత్యే=సత్యమునందు, అమృతం = అమృతత్వము. అనఁగా మోక్షము, ఆహితంహి=ఉంచఁబడి యున్నది గదా?

తా. నీవు సత్యస్వరూపుఁడవై యుండుము. సత్యమునందు లోకములన్నియు నిలిచియున్నవి. లోకము లన్నియు సత్యమువలన నుత్పత్తియగుచున్నది. సత్యమువల్ల మోక్షము సిద్ధము.

4

నివృత్తేనైవ దోషేణ తపోవ్రత మిహాచరేత్,
ఏతద్ధాత్రా కృతం *వృత్తం సత్యమేవ సతాంవరమ్.

టీ. దోషేణ=క్రోధాదిదోషములు, నివృత్తేనఏవ = నివర్తింపఁబడినది కాఁగానె, ఇహ=ఇచ్చట, తపోవ్రతం=తపస్సనెడువ్రతము, ఆచరేత్=ఆచరింపవలయును, ఏతత్=ఈ, సత్యమేవ=సత్యమే, ధాత్రా=పరమేశ్వరునిచే, కృతం=నిర్ణయింపఁబడిన, సతాం=సత్పురుషులకు, పరం=శ్రేష్ఠమైన, వృత్తం = ఆచారము.

తా. క్రోధాదిదోషరహితముగా తపమాచరించుట శ్రేష్ఠము. సత్యమే సత్పురుషులకు గొప్పతపస్సుగా పరమేశ్వరనిర్ణయము.

దోషై రేతై ర్వియుక్తం తు గుణై రేతై స్సమన్వితమ్,
ఏతత్సమృద్ధ మత్యర్థం తపో భవతి కేవలమ్. ౩౨

టీ. యత్=ఏతపము, ఏతైః దోషైః=ఈక్రోధాదులగు దోషములచేత, వియుక్తం=వదలిపెట్టఁబడినదో, ఏతైః గుణైః=ఈజ్ఞానాదిగుణములచే, సమన్వితమ్=కూడినదగుచున్నదో, ఏతత్ తపః=అట్టియీతపస్సు, అత్యర్థం=చక్కఁగా ఫలవంతమైనదియు, సమృద్ధం=విశేషించిఫలవంతమైనది, కేవలమ్=ముఖ్యమైనదియును, భవతి=అగుచున్నది.

తా. క్రోధాదిదోషరహితమైనదియు, జ్ఞానాదిగుణసహిత మగు పరిశుద్ధమయినతపస్సు, ముఖ్యమై చక్కఁగా ఫలవంతమగుచున్నది. మఱియు విశేషమైన ఫల మొసంగుచున్నది.

యన్మాం పృచ్ఛసి రాజేన్ద్ర సంక్షేపా త్త ద్బ్రవీమి తే,
ఏతత్పాపహరం శుద్ధం జన్మమృత్యుజరాపహమ్. ౩౩

---

* ఇచ్చట 'వృత్తం' అనుటకు మాఱుగా, 'విత్త' మనియు కొన్ని ప్రతులయందున్నది. అప్పుడు సత్పురుషులకు శ్రేష్ఠమైన విత్తమని యర్థము.

టీ. రాజేన్ద్ర = రాజశ్రేష్ఠా! మాం = నన్ను, యత్ = దేనిని, పృచ్ఛసి = అడుగుచున్నావో, తత్ = దానిని, సంక్షేపాత్ = సంగ్రహముగా, తే = నీకు, బ్రవీమి = చెప్పుచున్నాను; ఏతత్ = ఈచెప్పఁబోవునది, పాపహరం=పాపములను పోఁగొట్టునది, శుద్ధం = పవిత్రమైనది, జన్మమృత్యుజరాపహం=పుట్టుకను, మరణమును, ముసలితనమును లేనిదిగాఁజేయునది.

తా. ఓరాజశ్రేష్ఠా! నీ వడిగినదాని సంక్షేపముగా నుడువుచున్నాఁడను. లెస్సగా నాకర్ణింపుము. నేనుజెప్పఁబోవునది సకలపాపక్షయకరము, పవిత్రమైనది, జన్మమరణజరలను సైతము రహితపఱచునది.

ఇంద్రియేభ్యశ్చ పఞ్చభ్యో మనసశ్చైవ భారత,
అతీతానాగతేభ్యశ్చ ముక్తశ్చేత్స సుఖీ భవేత్. ౩౮

టీ. హేభారత = భరతకులమునందు పుట్టిన ఓరాజా! పఞ్చభ్యః= ఐదైన, ఇంద్రియేభ్యః=ఇంద్రియములనుండి లేక విషయములనుండియు, మనసః=మనస్సునుండియు, అతీతానాగతేభ్యశ్చ=గతించినవానియందుండియు రాఁబోవువానియందుండియు, ముక్తశ్చేత్=వదలిపెట్టఁబడినవాఁడైనయెడల, సః=వాఁడు, సుఖీ=సుఖముగలవాఁడు, భవేత్=కాఁగలఁడు.

తా. విషయాదులయందుఁ బ్రవర్తించు నింద్రియములను మనస్సును స్వేచ్ఛగాఁ బోనీయక వశపఱచుకొని, గతించినవానిఁ గూర్చియు, రాఁబోవువానిం గూర్చియు లక్ష్యములేనివాఁడె సుఖి.

ధృతరాష్ట్ర ఉవాచ.—

ఆఖ్యానపఞ్చమైర్వేదైః భూయిష్ఠం కత్థ్యతే జనః,
తథాచాన్యే చతుర్వేదా స్త్రివేదాశ్చ తథాఽపరే.
ద్వివేదాశ్చైకవేదాశ్చ అనృచశ్చ తథాఽపరే,
ఏతేషుమేఽధికం బ్రూహియమహం వేద బ్రాహ్మణమ్.

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. జనః=ఒకానొకఁడు, ఆఖ్యానపఞ్చమైః = పురాణములతో నైదగు, వేదైః=వేదములచేత, భూయిష్ఠం=మిక్కిలి పొగడ్తఁగన్నవాఁడై, కథ్యతే=చెప్పఁబడుచున్నాఁడు. తథా=ఆరీతిఁగా, అన్యే=కొందఱు, చతుర్వేదాః = చతుర్వేదులనియు, తథా = ఆదేవిధముగ, అపరే = మఱికొందఱు, త్రివేదాః=త్రివేదులనియు, తథా అపరే=అటులనే మఱికొందఱు, ద్వివేదాః=ద్వివేదులనియు, ఏకవేదాః=ఏకవేదులనియు, అనృచశ్చ=వేదహీనులనియు, (కథ్యంతే=చెప్పఁబడుచున్నారు). ఏతేషు=వీరిలో, అధికం=అధికుని, బ్రూహి=చెప్పుము. అహం=నేను, యం=ఎవనిని, బ్రాహ్మణమ్=బ్రహ్మవేత్తనుగా, వేద=తెలిసికొందును.

తా. పురాణేతిహాసంబులు పఞ్చమవేదంబని ఎన్నిక కలదుగదా? అవియు చతుర్వేదంబులును నేర్చి, పఞ్చవేదులనంబరఁగువారును, చతుర్వేదాధ్యయనంబొనర్చి చతుర్వేదులనంబరఁగువారును, వేదత్రయం బధ్యయనంబుసేసినవారును, ద్వివేదాధ్యయనంబుఁ గావించినవారును, ఏకవేదాధ్యాయులును, వేదాధ్యయనశూన్యులునైన బ్రాహ్మణులు లోకమునఁ బలుతెఱంగుల వర్తింతురుగదా? వారిలో నెవ రధికులు? తేటపడం జెప్పుమని ధృతరాష్ట్రుఁ డడిగెను.

ఏకవేదస్య చాజ్ఞానా ద్వేదా స్తే బహవోఽభవన్,
సత్యస్యైకస్య రాజేన్ద్ర సత్యే కశ్చి దవస్థితః. 32

టీ. రాజేన్ద్ర=రాజశ్రేష్ఠుఁడా! సత్యస్య=వేదస్వరూపుండును, ఏకస్య=అద్వితీయుఁడును, ఏకవేదస్య=సచ్చిదానందాద్వితీయ సంవిద్రూపమైన పరబ్రహ్మయొక్క, అజ్ఞానాత్ = ఎఱుంగకపోవుటవలన, తే=ఆ, వేదాః=వేదములు, బహవః=అనేకములు, అభవన్=అయెను. సత్యే=సత్యమునందు, కశ్చిత్=ఒకానొకఁడు, అవస్థితః=ఉన్నవాఁడగును.

తా. సచ్చిదానందాద్వితీయ పరబ్రహ్మను ముఖ్యముగా మనుష్యుఁడెఱుఁగవలసినది. దానియొక్క సత్యస్థితిని తెలిసికొనక పోవుటచేత దానిని దెలుపుటకై వేదము లనేకములయినవి. ఈకారణముచేత వేదము లనేకములయినవని యీసత్యము నెఱింగినవాఁడు పరబ్రహ్మ నెఱింగిన బ్రహ్మవేత్త యగును.

వేదశబ్దమున కుత్పత్తియైనధాతువునకు అవయవార్థములు నాలుగువిధములుగా శ్రీశంకరాచార్యులు నుడివియున్నారు. 1. విద=విచారణే-అనగా పరబ్రహ్మము నెఱుఁగ నాసక్తితో విచారించు మనస్సుగలుగుట. 2. విద=సత్తాయామ్-అనగా పరబ్రహ్మముయొక్క ఉనికిని సాధించుటయందాసక్తిగల మనస్సుగలవాఁడగుట. 3. విద=జ్ఞానే-అనగా పరబ్రహ్మమును జ్ఞానముచే తెలుసుకొనుట కాసక్తిగలమనస్సుగలవాఁడనియు. 4. విద్లృ=లాభే-అనగా పరబ్రహ్మనుపొందుట కాసక్తి గలవాఁడనియు.

* ఏవం వేద మవిజ్ఞాయ ప్రాజ్ఞోఽహ మితి మన్యతే,
దాన మధ్యయనం యజ్ఞో లోభాదేవ ప్రవర్తతే. 37

టీ. ఏవం=ఈరీతిఁగా, వేదం=బ్రహ్మమును, అవిజ్ఞాయ=తెలియక, అహం=నేను, ప్రాజ్ఞః=తెలిసినవాఁడను, ఇతి=అని, మన్యతే=తలఁచును. దానం=దానము, అధ్యయనం=అధ్యయనము, యజ్ఞః=యజ్ఞము, లోభాత్ ఏవ=లోభమువలననే, ప్రవర్తతే=వర్తించుచున్నది.

తా. చిత్సదానందాద్వితీయబ్రహ్మమును వ్యక్తపఱచునది వేదము. ఈసంగతిసుమంతయైన నెఱుంగనివాఁడు తాను ప్రాజ్ఞుఁడనని తెలుసుకొనుచు ద్రవ్యార్జనకై యజ్ఞయాగాదికర్మల నొనర్చుచు, ఇతరులచే చేయించుచు, అజ్ఞుఁడీలోకమున మెలంగుచున్నాఁడు.

సత్యాత్ప్రచ్యవమానానాం సఙ్కల్పా వితథాఽభవన్,
తతః కర్మ ప్రతాయేత సత్యస్యానవధారణాత్. 38

---

* 'య ఏవం వేద తత్సత్యం ప్రాజ్ఞో భవతి నిత్యదా' యని పాఠాన్తరము.

టీ. సత్యాత్=సత్య, జ్ఞానాదిలక్షణములతో యుక్తుఁడగు బ్రహ్మము నుండి, ప్రచ్యవమానానాం=స్వాధిక బ్రహ్మభావమునుండి జారుచు, అనాత్మ యగు శరీరాదులయం దాత్మభావమును కల్పించు వారియొక్క, సఙ్కల్పాః=సఙ్కల్పములు, వితథాః = నిష్ప్రయోజనములు - సిద్ధినిపొందనివి, అభవన్=అయెను. తతః=కావున, సత్యస్య=సత్యజ్ఞానాదిలక్షణయుక్తుఁడగు పరబ్రహ్మయొక్క, అనవధారణాత్ = తెలిసికొనక పోవుటవలన, కర్మ= యజ్ఞాదికర్మలు, ప్రతాయేత=విస్తరింపఁబడును.

తా. సత్యజ్ఞానానంద స్వరూపమైన పరబ్రహ్మ నెఱుంగనివారు విఫల మనోరథు లగుదురు. వారికోరికలు సిద్ధించుటకై యాగాదుల నొనర్తురు. ఇయ్యది యథార్థము నెఱుంగలేని యవిద్య. ఈకర్మలవలన సంసారము కలుగుచున్నది. సంసారమునఁ దాపత్రయాదులచే నవస్థఁ బొందుచు, రాగ ద్వేషాదులు జీవిని పలుతెఱంగుల త్రిప్పుచుండఁగా, తాను పరబ్రహ్మయని యేమాత్రము జ్ఞానములేనివాఁడై స్వర్గపశ్వన్నాదిహీనసాధనములకై జీవి యత్నించుచుండును.

విద్యాద్బహుపఠన్తం తు బహువాగితి బ్రాహ్మణమ్,
య ఏవ సత్యాన్నాపైతి స జ్ఞేయో బ్రాహ్మణస్త్వయా.

టీ. బహు= విశేషముగా (ఇతిహాసపురాణాదులగు ఆఖ్యానపఞ్చ వేదాధ్యాపకుఁడు), పఠన్తం=చదివిన, తం=ఆ, బ్రాహ్మణం=బ్రాహ్మణుని, బహువాక్ ఇతి=వాచాలుఁడని, విద్యాత్=తెలిసికొనవలయును. (కాని సాక్షాత్పరబ్రహ్మము కానేరఁడు), యః=ఎవఁడు, సత్యాత్=బ్రహ్మమునుండి, నాపైతి=తొలఁగఁడో, సః=వాఁడు, త్వయా=నీచేత, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడుగా (డని), జ్ఞేయః = ఎఱుంగఁదగినది.

తా. ఇతిహాసపురాణములతోడి పఞ్చవేదములను అధ్యయనము జేసినను వానిని వాచాలుఁడని చెప్పవలయునుగాని బ్రాహ్మణుఁడని చెప్ప

వలనుపడదు. ఎవఁడైతే సత్యజ్ఞానాదిలక్షణ స్వరూపుండగు బ్రహ్మమునుండి తొలఁగకయుండునో వానినే బ్రాహ్మణునిగాఁ దెలియుము.

ఛన్దాంసి నామ ద్విపదాం వరిష్ఠ
స్వచ్ఛన్దయోగేన భవన్తి తత్ర,
ఛన్దోవిదస్తేన చ తా నధీత్య
గతా హి వేదస్య న వేదమార్యాః. ౪౧

టీ. (హే) ద్విపదాంవరిష్ఠ = మనుజులలో శ్రేష్ఠుఁడ వగు నో ధృతరాష్ట్ర! ఛందాంసి=వేదములు, స్వచ్ఛన్దయోగేన=స్వాధీనములుగా - అనగా యథాకామములుగా, లేక స్వేచ్ఛగా, తత్ర=పరమాత్మయందు, భవన్తి నామ=ప్రమాణములై ప్రవర్తించుచున్నవి గాక, తేన=ఆ హేతువుచేత, ఛందోవిదః=వేదవేత్తలు అగు, ఆర్యాః=అర్యులు-అనగా పెద్దలు, తాన్=ఆ, వేదాన్=వేదములను, అధీత్య=చదివి—వేదాన్త శ్రవణాదులను చేసియును ట. వేదస్య = సంవిద్రూపమైన పరమాత్మయొక్క (స్వరూపం=స్వరూపమును), నగతాహి=పొందలేకుగదా.

తా. వేదములు పరమాత్మ స్వరూపమును పొందుటకు తగిన సాధనములు. అట్టివేదముల నెఱింగిన పెద్ద పరబ్రహ్మను సులభముగా నెఱుంగును. ప్రపఞ్చమును పొందఁడు.

న వేదానాం వేదితా కశ్చిదస్తి
వేదేన వేదం న విదుర్న వేద్యమ్,
యో వేద వేదం స చ వేద వేద్యం
యో వేద వేద్యం న స వేద సత్యమ్. ౪౨

టీ. వేదానాం = వేదములలోపల, వేదితా = (వాచామగోచరుఁడై చిత్స్వరూపుఁడైన పరమాత్మను) తెలుపఁగల, కశ్చిత్ =ఒకవేదమైనను, న= దు. వేదేన= జడస్వరూపమగు ఋగాదివేదముచేత, వేదం=జ్ఞానస్వరూప

మగు పరమాత్మను, నవిదుః = (వేదపాఠులు) ఎఱుఁగరు. వేద్యం=ప్రపంచమును (కూడ), నవిదుః=ఎఱుఁగరు. యః=ఎవఁడు, వేదం=జ్ఞానస్వరూపియగు పరమాత్మను, వేద=ఎఱుఁగునో, సః=ఆతఁడు, వేద్యం=ప్రపంచమును, వేద=ఎఱుఁగును. యః=ఎవఁడు, వేద్యం=ప్రపంచమును (మాత్రము), వేద=ఎఱుఁగునో (ప్రపంచమునే యాత్మయనితలఁచునో), సః=వాఁడు, సత్యం=సత్యాదిలక్షణములుగల పరమాత్మను, నవేద=ఎఱుఁగఁడు.

తా. ఋగాదివేదములు జడస్వరూపములు. పరమాత్మ వాచామగోచరుఁడు, సత్యస్వరూపుఁడు. కనుక జడరూపములైన వేదములచే సత్యస్వరూపుఁడగు పరమాత్మ నెఱుఁగుటకు వీలుగాదు. మఱియు జ్ఞానముచేతనే నిత్యానిత్యములను రెంటి నెఱుఁగవలెను గాని జడరూపమయిన వేదముచేత మిథ్య యగు ప్రపంచము నెఱుఁగ వీలు కాదు. ఎవఁడు జ్ఞానస్వరూపియగు పరమాత్మ నెఱుఁగుచున్నాఁడో మిథ్య యగు ప్రపంచమును నెఱుఁగుచున్నాఁడు. ఎవఁడు జ్ఞానముఁ బడయక యీప్రపంచమును మాత్రము నెఱుఁగునో వాఁడు జ్ఞానస్వరూపుఁడగు పరమాత్మ నెఱుఁగఁజాలఁడు.

యో వేద వేదాన్ న చ వేద వేద్యం
న తం విదు ర్వేదవిదో న వేదాః,
తథాపి వేదేన విదన్తి వేదం
యే బ్రాహ్మణా వేదవిదో భవన్తి. ४३

టీ. యః=ఎవఁడు, వేదాన్ = ఋగాదివేదములను, వేద=ఎఱుంగునో, సః=ఆతఁడు, వేద్యంచ = ప్రపంచమునును, వేద=ఎఱుఁగును. వేదవిదః=ఋగాదివేదముల నధ్యయనముచేసినవారు, తం=(వాచామగోచరుండయిన) ఆపరమాత్మను, నవిదుః=ఎఱుఁగరు. వేదాః (అపి)=వేదములుకూడ, (తం) న (విదుః) = ఆపరమాత్మను ఎఱుఁగవు. (వేదములకే పరమాత్మ నెఱుఁగుటకు శక్తిలేదనుట.) తథాపి=అట్లున్నను, యేబ్రాహ్మణాః=ఏబ్రహ్మవేత్తలు, వేదవిదః=(వేదములు బ్రహ్మస్వరూపము నుపపాదించుపద్ధతుల) నెఱిఁగినవా

రగా, భవన్తి=అగుచున్నారో, తే=అట్టి బ్రహ్మవేత్తలు, వేదేన=ఋగాది వేదములచేత, వేదం=జ్ఞానస్వరూపమయిన పరమాత్మను, విదన్తి=ఎఱుఁగుచున్నారు.

తా. కేవలవేదముల నెఱిఁగినవారు ప్రపంచవిషయముల నెఱుఁగఁగలరు కాని, పరమాత్మ నెఱుఁగలేరు. వేదాధ్యయనము చేసినవారికి వాచామగోచరుండైన పరమాత్మ నెఱుఁగుటకుగాని, ఆవేదములకు పరమాత్మ యిట్టిదని చెప్పుటకుగాని వీలుగాదు. అట్లున్నను, ఏబ్రహ్మవేత్తలు, వేదములు, 'తత్త్వమస్యాది' మహావాక్యములచే ఏవిధముగా పరమాత్మ నుపపాదించుచున్నవో, ఆప్రకారముల నెఱిఁగినవారు వేదములచే సత్యస్వరూపమయిన పరమాత్మ నెఱుఁగఁగలరు.

* యామాంశభాగస్య తథాహి వేదాః
యథాహి శాఖా చ మహీరుహస్య,
సంవేదనే ప్యేవ మథా మనన్తి
తస్మిన్ హి నిత్యే పరమాత్మ నోఽర్థే. ౪౪

టీ. యథాహి=ఏరీతిగా, యామాంశభాగస్య=విదియనాటి చంద్రదర్శనము, సంవేదనే=అగుటయందు, మహీరుహస్య=వృక్షముయొక్క, శాఖాః=కొమ్మలు(హేతువగునో), తథాహి=ఆరీతిగా, వేదాః=వేదములు,అథ=ఇఁకను, పరమాత్మనః=పరబ్రహ్మయొక్క, అర్థే=పూర్ణానంద రూపమగు పరమపురుషార్థమైనట్టి, నిత్యే=శాశ్వతమగు, సంవేదనే=తెలిసికొనుటయందు, ఏవం అమనన్తి=ఈవిధముగ (హేతువగునని) చెప్పుచున్నారు.

తా. శుక్లపక్షవిదియనాటిచంద్రుఁ డతి సూక్ష్మముగాఁ గనఁబడును. అట్లు సూక్ష్మమై యగపడు చంద్రుని నొకఁడు తనదృష్టిచేతఁ దెలిసికొని మఱియొకనికిఁ జూపునపుడు గుర్తునకై యొకచెట్టుకొమ్మను జూపి దానియగ్రముగుండాచూచినఁ జంద్రుఁడు కనబడుచున్నాఁడని ఎట్లు జూడఁజెప్పునో, అదే

---

* "ధామాంశభాగస్య" అని పాఠాన్తరము.

రీతిగ వేదములు పరబ్రహ్మస్వరూపము నెఱుంగుటకై ఉపయోగపడును. చెట్టుకొమ్మకొనయందు చంద్రుఁ డెట్లుండఁడో అట్లే వేదములలోను పరబ్రహ్మ లేదు. అయిన వానిని సాధనములుగా నుపయోగించి, పరబ్రహ్మ నెఱుంగవలయు.

అభిజానామి బ్రాహ్మణ మాఖ్యాతారం విచక్షణమ్,
ఏవం యోఽభివిజానాతి సజానాతి పరం హితమ్. ౪౫

టీ. ఆఖ్యాతారం= (పరబ్రహ్మను) చెప్పునట్టి, విచక్షణం=విద్వాంసుని, బ్రాహ్మణం=బ్రాహ్మణునిగా, అభిజానామి = తెలిసికొనుచున్నాను. ఏవంహి=ఈరీతిఁగా, నేనుచెప్పినట్టు వేదములయందు వేదనరూపాత్మప్రతిపాదనప్రకారముగా, యః=ఎవఁడు, అభివిజానాతి=తెలియునో, సః=వాఁడు, తత్పరం=ఆపరబ్రహ్మను, జానాతిహి=తెలియునుగదా ?

తా. పరబ్రహ్మను తెలియుటకు వేదవాక్యము లాధారములు. ఆయాధారముచేత బ్రహ్మము నెఱింగినవాఁడే బ్రాహ్మణుఁడు. ఈ యాధారమునే తప్ప వేఱువిధముగా పరబ్రహ్మ నెఱుంగుట కష్టము.

నాస్య పర్యేషణం గచ్ఛే త్ప్రత్యర్థిషు కదాచన,
అవిచిన్వ న్నిమం వేదే తతః పశ్యతి తం ప్రభుమ్. ౪౬

టీ. ప్రత్యర్థిషు=శత్రువులగు నయనాదీంద్రియములందు, అస్య=ఈపరబ్రహ్మయొక్క, పర్యేషణం=వెదకుటను, కదాచన=ఎప్పటికిని, నగచ్ఛేత్ =చేయకూడదు (విషయాన్వేషణపరుఁ డెప్పటికిని కాఁగూడదనిభావము). అవిచిన్వన్=విషయసంచయము చేయనివాఁడై, తతః=పిమ్మట, ఇమం=ఈప్రత్యగాత్మయైన, తంప్రభుం=ఆపరబ్రహ్మను, వేదే=ఉపనిషత్తులగు వేదములయందు - 'తత్త్వమస్యా'ది మహావాక్యములయందు, పశ్యతి=చూచుచున్నాఁడు.

తా. పరబ్రహ్మ నెఱుంగనీయక దేహసంబంధములగు నింద్రియములు సుఖాదులను మఱిగి యడ్డుపెట్టును. వీనినే పరబ్రహ్మ యని భావించఁగూడదు. ఉపనిషత్తులు మొదలయిన వేదంబులు బోధించు 'తత్త్వమస్యా' ది మహావాక్యములయందు నమ్మకముఁగలవాఁడు పరబ్రహ్మ నెఱుంగును.

* తూష్ణీంభూత ఉపాసీత నచేచ్ఛే న్మనసా అపి,
అభ్యావర్తేత బ్రహ్మాస్మై బహ్వానన్తరమాప్నుయాత్.

టీ. తూష్ణీంభూతః = ఊరక ఉన్నవాఁడై—సర్వకర్మ సన్యాసముఁజేసి, తనయందలి పరమాత్మకు వ్యతిరిక్తమైనదాని నన్నింటిని వదలి, కేవలుఁడై లోకమునంతయు స్వాత్మగా, ఉపాసీత = ఉపాసించవలయును. మనసాఽపి = మనస్సుతోనైనను, న ఇచ్ఛేత్ చ=కోరనుగూడదు - అనఁగా విషయేచ్ఛ యేమాత్రమును కూడ దనుట. అస్మై=వీనికొఱకు, బ్రహ్మ = పరబ్రహ్మము,అభ్యావర్తేత=అభిముఖమగును. అనన్తరం=ఆవిర్భూతస్వరూపముగలవాఁడైనపిమ్మట,బహు=పరబ్రహ్మమును,ఆప్నుయాత్=పొందును.

తా. సర్వకర్మ సన్యాసియై, కేవలుఁడై లోకమునంతయు స్వాత్మగా భావించి, విషయేచ్ఛ లేక యెవఁడుండునో వానికి పరబ్రహ్మ మభిముఖమగును. వాఁడు సుఖముగనే పరబ్రహ్మమును పొందఁగలఁడు.

మౌనా ద్ధి ముని ర్భవతి నారణ్యావసనా న్మునిః,
అక్షరం తం తు యో వేద స మునిశ్రేష్ఠ ఉచ్యతే. ౪౫

టీ. మౌనాత్ = మౌనమువలన, మునిః=ముని, భవతి హి = అగుచున్నాఁడుగదా! అరణ్యే=కౌననమునందు, వసనాత్ = ఉనికిపట్టు చేకొనుటవలన, మునిః=ముని, న=కాఁడు. అక్షరం=అవినాశుఁడగు, తం=ఆపరమాత్మను, యః=ఏవాఁడు, వేద=ఎఱుంగునో, సః=వాఁడు, మునిశ్రేష్ఠః=మునిశ్రేష్ఠుఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

---

* తూష్ణీం భూత ఉపాసీత నచేష్టే న్మనసాపిచ,
ఉపావర్తస్వ తద్బ్రహ్మ హ్యన్తరాత్మని వై శ్రుతమ్.

అని యొకానొక ప్రతియందు కానవచ్చుచున్నది. అందుల తాత్పర్యమేమనగా—బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహమును జేసి, మౌనమును పూని పరబ్రహ్మమున కభిముఖివి కమ్ము ఆబ్రహ్మమును నీహృదయాకాశముననే కన నగు నని భావము. (ఇది మైసూరు ప్రతియందు కానరాదు.)

తా. ఇంద్రియనిగ్రహముఁ జేయువాఁడు ముని యనఁబడును కాని కాననమునందు నివసించినంతమాత్రమున మునికాఁడు. ఈరీతిగ ఇంద్రియస్వేచ్ఛావృత్తికి లోఁబడక దానిని నిగ్రహించి, నాశరహితుని పరమాత్మ నెవం డెఱుంగునో వాఁడ మునిశ్రేష్ఠుండు.

సర్వార్థానాం వ్యాకరణాత్ వైయాకరణ ఉచ్యతే,
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా. ౪౯

టీ. సర్వార్థానాం = సమస్తపదములయొక్క అర్థములను, వ్యాకరణాత్ = విమర్శచేయుటవలన, వైయాకరణః = వైయాకరణుఁడని, ఉచ్యతే = పిలువఁబడుచున్నాఁడు. తన్మూలతః = ఆయక్షరమువలన, వ్యాకరణం = వ్యాకరణము (స్యాత్ = అగుచున్నది.), వ్యాకరోతి ఇతి = విమర్శించుటవలన, తత్ = అది, తథా = ఆవిధముగా నగుచున్నది.

తా. సుశబ్దాపశబ్దత్వ విమర్శచేయువాఁడు, వైయాకరణుఁడు. ప్రపంచముయొక్క నామరూపవ్యాకరణము పరబ్రహ్మమువలన నేర్పఁబడుచున్నది. కావున పరబ్రహ్మ వైయాకరణి యనంబడును. ఆతనిని విమర్శించు యోగియు వైయాకరణుండనియుం జెప్పఁబడుచున్నాఁడు.

ప్రత్యక్షదర్శీ లోకానాం సర్వదర్శీ భవేన్నరః,
సత్యే వై బ్రహ్మణి తిష్ఠన్ తద్విద్వాన్ సర్వవిద్భవేత్. ౫౦

టీ. లోకానాం = లోకములయొక్క (ను), ప్రత్యక్షదర్శీ = ప్రత్యక్షముగఁజూచువాఁడగు, నరః = మనుజుఁడు, సర్వదర్శీ = సర్వకారణరూపమైన పరమాత్మనుజూచు సర్వజ్ఞమూర్తి, భవేత్ = అగును. సత్యే = సత్యాది లక్షణయుక్తుఁడగు, బ్రహ్మణి = పరమాత్మయందు, తిష్ఠన్ = ఉన్నవాఁడై, తత్ = ఆ, విద్వాన్ = సత్యాదిలక్షణయుక్తుఁడగు పరబ్రహ్మను ఆత్మయందే ఎఱిఁగినవాఁడు, సర్వవిత్ = సర్వజ్ఞమూర్తి, భవేత్ = అగుచున్నాఁడు.

తా. సర్వలోకములను ప్రత్యక్షానుభవముతో నెఱిఁగిన వాఁడు సర్వజ్ఞమూర్తి. పరమాత్మను తెలిసికొనుటకై బ్రహ్మచర్యము నాచరించి పరమాత్మ నెఱింగినవాఁడును సర్వజ్ఞమూర్తియే.

జ్ఞానాదిషు స్థితోఽప్యేవం క్షత్రియ బ్రహ్మ పశ్యతి,
వేదానాం చారపూర్వేణ చైతద్విద్వన్ బ్రవీమి తే.॥౧

టీ. క్షత్రియ = ఓరాజా! జ్ఞానాదిషు=ముందుచెప్పఁబడిన జ్ఞానాదిగుణములందు, స్థితః అపి = ఉన్నవాఁడును, ఏవం=ఈవిధముగా, బ్రహ్మ=బ్రహ్మమును, పశ్యతి = చూచుచున్నాఁడు. వేదానాం చారపూర్వేణ = వేదాన్తశ్రవణపూర్వకముగా, బ్రహ్మ పశ్యతి=బ్రహ్మనుచూచుచున్నాఁడు. ఏతత్=వేదాన్తవిచారప్రకారమును, హేవిద్వన్=విద్వాంసుఁడగు ఓధృతరాష్ట్ర! తే=నీకు, బ్రవీమి=చెప్పెదను.

తా. జ్ఞానాది ద్వాదశగుణములను గలవాఁడు, వేదముల ననుసరించి ప్రవర్తించువాఁడు, బ్రహ్మమును పొందఁగలఁడు. అయితే జ్ఞానాదిగుణములు గలిగి వేదాన్త శ్రవణము ఏమాత్రము లేనివాఁడు బ్రహ్మమును పొందఁజాలఁడు. వేదములు వేదస్వరూపుఁడగు పరబ్రహ్మను తెలియఁజేయునవి. ఈవిషయమును నేను ఓవిద్వాంసుఁడవగు రాజేంద్రుఁడా! నీకు దృఢముగా చెప్పఁగలను అని సనత్సుజాతుఁడు చెప్పెను.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయ్యాశిక్యాం ఉద్యోగపర్వణి ధృతరాష్ట్ర సనత్కుమార సంవాదే శ్రీమత్సనత్సుజాతీయే ద్వితీయోఽధ్యాయః.

---

# తృ తీ యో ధ్యా యః.



ధృతరాష్ట్ర ఉవాచ:—

సనత్సుజాత యదిమాం పరార్థాం
బ్రాహ్మీం వాచం వదసి హి విశ్వరూపామ్,
పరాం హి కార్యేషు సుదుర్లభాం కథాం
ప్రబ్రూహి మే వాక్య మేవం కుమార. ౧

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు అడుగుచున్నాఁడు.—

టీ. సనత్సుజాత = ఓసనత్సుజాతుఁడా! పరార్థాం = ఉత్కృష్టమైనదియును, విశ్వరూపాం = నానారూపములైనదియును, బ్రాహ్మీం= బ్రహ్మఅనగా పరబ్రహ్మను సంబంధించినదియగు, వాచం = వాక్యము, యత్ = ఏకారణమువలన, వదసి = పలికితివో, తత్ = ఆకారణమువలన, పరాం = ఉత్తమమైనదియు, కార్యేషు = కార్యవర్గసంబంధి యగు ప్రపంచమునందు, సుదుర్లభాం = వినుటకును అశక్యమైనదియునగు, ఏవంవాచం = ఇట్టివాక్యముగల, కథాం=కథను, కుమార=ఓకుమార, మే=నాకు, ప్రబ్రూహి=చెప్పుము.

తా. నానావిధమును మోక్షసాధనమును అయిన పరబ్రహ్మతత్త్వమును గూర్చినజ్ఞానమును చక్కగా నుపదేశించితివి. పరమపురుషార్థసాధన మగు దానిని కష్టమైనదానిని వక్కాణింప నీవేయర్హుఁడవు. అట్టిదానిని మఱొక్కటిని విశదీకరింపుము. సావధానుండనై వినియెద నని సనత్కుమారుని ధృతరాష్ట్రుఁ డడిగెను.

సనత్సుజాత ఉవాచ.—

నైతద్బ్రహ్మ త్వరమాణేన లభ్యం
యన్మాం పృచ్ఛ స్యభిషఙ్గేణ రాజన్,
బుద్ధౌ ప్రలీనే మనసి ప్రచిన్త్యా
విద్యా హి సా బ్రహ్మచర్యేణ లభ్యా. ౨

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే రాజన్=ఓరాజా! మాం=నన్ను, యత్=దేనిని గూర్చి, అభిషఙ్గేణ=శ్రద్ధతో, పృచ్ఛసి=అడుగుచున్నావో, ఏతత్=ఈ, బ్రహ్మ=పరబ్రహ్మము, త్వరమాణేన=వేగపడు, పురుషేణ=మనుజునిచేత, న లభ్యం=పొందఁదగను. బుద్ధౌ=బుద్ధి, ప్రలీనే సతి=లీనముయినది అగుచుండఁగా, మనసి=మనస్సునందు, ప్రచిన్త్యా=ఆలోచింపఁదగిన, సా=ఆ, విద్యా=విద్య, బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యముచేత, లభ్యా=పొందఁదగినది.

తా. బ్రహ్మంబు త్వరపడి తెలియ నశక్యంబు. సంకల్ప వికల్పాత్మకంబైన మనస్సును భోగాదులగు విషయాదులందుండి మరల్చి పరబ్రహ్మమునందు చలింపని యేకాగ్రచిత్తతో నుండినగాని యాపరబ్రహ్మనుపొందలేము. దానిని పొందుటకు బ్రహ్మచర్యంబు ముఖ్యసాధనంబు. గురుప్రసాదంబు వడసి వృద్ధి గాంచినవారి కది సులభోపాయంబై యుండును.

ఆద్యాం విద్యాం వదసి హి సత్యరూపాం
యా ప్రాప్యతే బ్రహ్మచర్యేణ సద్భిః,
యాం ప్రాప్యైనం మర్త్యభావం త్యజన్తి
యా వై విద్యా గురువృద్ధేషు నిత్యా. 3

టీ.: యా=ఏ, విద్యా=విద్య, సద్భిః=సజ్జనులచేత, బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యవ్రతముచేత, ప్రాప్యతే=పొందఁబడుచున్నదో, యాం=దేనిని,

ప్రాప్య=పొంది, ఏనం మర్త్యభావం=ఈమనుష్యభావమును, త్యజన్తి=వద లుచున్నారో, యా=ఎటువంటి, విద్యా=విద్య, గురువృద్ధేషు=గురువులయొ క్క విద్యాప్రదానములచేత వృద్ధిఁజెందిన శిష్యులయందు, నిత్యా = నియత ముగా లేక శాశ్వతమైనదిగా నిల్చియుండునో (తాం = ఆ), ఆద్యాం= సర్వాధిభూత బ్రహ్మవిషయమును, సత్యరూపాం = పరమార్థరూప మగునట్టి యు, విద్యాం=విద్యను, వదసిహి=చెప్పుచున్నావుగదా!

తా. నీవు, ఓధృతరాష్ట్ర! సత్యరూపమును, సకలవిద్యలకు హేతు వగుదానిని వినఁగోరితివి. సత్పురుషుల కది బ్రహ్మచర్యవ్రతమువలన సాధ్య ము. దానిని సాధించి మర్త్యభావమును వదలెదరు. శాస్త్రీయముగ నుపదే శింపఁబడిన జ్ఞానికిఁగాని తదితరుల కది నిలువదు. కాఁబట్టి గురుశుశ్రూష యావశ్యకంబు. అట్టిశిష్యులకుఁగాని బ్రహ్మవిద్య యితరులకు నిలువదు.

ధృతరాష్ట్ర ఉవాచ.—

బ్రహ్మచర్యేణ యా విద్యా శక్యా వేదితు మఞ్జసా,
తత్కథం బ్రహ్మచర్యం స్యాదేత ద్విద్వ న్బ్రవీహి మే.

ధృతరాష్ట్ర ఉవాచ = ధృతరాష్ట్రుఁడు అడుగుచున్నాఁడు.—

టీ. యా=ఏ, విద్యా=విద్య, బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యముచేత,అం జసా=వేగముగా, వేదితుం=తెలియుటకు, శక్యా=శక్యమో, వేదే=వేదవిష యమునందు, తత్=ఆ(సాధనభూతమైన),బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యము, కథం స్యాత్=ఎట్లగును? మే=నాకు, (హే) విద్వన్=ఓ పండితుఁడా, బ్రూ హి=చెప్పుము.

తా. బ్రహ్మచర్యవ్రత మాచరించుటంజేసి బ్రహ్మవిద్య పొందదగినది యనుట ప్రసిద్ధము. వేదవిషయమున నాసాధనభూతమైన బ్రహ్మచర్యము నెట్లాచరింప వలయును? దీనిని నాకు ఓ సనత్కుమారా! స్పష్టముగునట్లు చెప్పుమని ధృతరాష్ట్రుఁ డడిగెను.

సనత్సుజాత ఉవాచ.—

ఆచార్యయోని మిహ యే ప్రవిశ్య
భూత్వా గర్భం బ్రహ్మచర్యం చరన్తి,
ఇహైవ తే శాస్త్రకారా భవన్తి
విహాయ దేహం పరమం యాన్తి సత్యమ్. ౫

సనత్సుజాత ఉవాచ = సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. ఇహ=ఈలోకమునందు, యే=ఎవ్వరు, ఆచార్యయోనిం=గురుసామీప్యమును, ప్రవిశ్య = పొంది, గర్భం భూత్వా=ఉపసదనాదులచే శిష్యులయి, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యవ్రతమును, చరన్తి=చేయుచున్నారో, తే=వారలు, ఇహైవ=ఈలోకముననే, శాస్త్రకారాః=శాస్త్రకర్తలు, లేక పండితులు, భవన్తి=అయ్యెదరు. దేహం=(ఆరంభించినకర్మనశింపఁగా) దేహమును, విహాయ=వదలి, పరమం సత్యం=సత్యాదిలక్షణయుక్తుఁడగు పరమాత్మను, యాన్తి=ప్రాపించుచున్నారు.

తా. గురువును సమీపించి శిష్యులయి బ్రహ్మచర్యము నాచరించువారలు విద్య నభ్యసించుటంజేసి కొంతకాలమునకు శాస్త్రకర్త లయ్యెదరు; పిమ్మట దేహపాతముకాఁగా సత్యాదిలక్షణయుక్తుఁడగు పరమాత్మ నట్టివారే పొందెదరు.

అస్మిన్ లోకే విజయన్తీహ కామాన్
బ్రాహ్మీం స్థితిమనుతితిక్షమాణాః,
త ఆత్మానం నిర్హరన్తీహ దేహా
న్ముఞ్జా దిషీకామివ ధీరభావాత్. ౬

టీ. ఇహ=ఈలోకమునందు, బ్రాహ్మీం= పరబ్రహ్మమును గుఱించినదగు, స్థితిం=ఉనికినిగూర్చి, అనుతితిక్షమాణాః=ఓర్పుగలవారలు, అస్మిన్ లోకే=ఇచ్చటనే, కామాన్=కోరికలను, విజయన్తి = జయించుచున్నారు. తే=వారు, ధీరభావాత్=ధైర్యమువలన, ముఞ్జాత్=గడ్డినుండి, ఇషీకామ్

ఇన=కాడనువలె, ఇహ దేహాత్ = ఈదేహమునుండి, ఆత్మానం = చిన్మాత్రస్వరూపియగు ఆత్మను, నిర్హరన్తి=వెలుపలికిచెదరు.

తా. గురుకులవాసము చేయుచు, బ్రహ్మచర్య వ్రతమాచరించువారు పరబ్రహ్మాసక్తచిత్తులయి, శాంతులయి, కోరికలను జయించి, గడ్డిలోనుండి కాడనుతీయునట్లు యీశరీరమందుండి ధైర్యముతో నాత్మను వెలుపలికి తీసి మోక్షమును పొందుదురు.

శరీరమేతౌ కురుతః పితామాతాచ భారత,
ఆచార్యతస్తు యజ్జన్మ తత్సత్యంవై తథాఽమృతం. ౭

టీ. భారత =ఓధృతరాష్ట్రా! ఏతౌ=ఈ, పితా మాతా చ=తల్లిదండ్రులు, శరీరం=దేహమును, కురుతః=చేయుచున్నారు. ఆచార్యతః=గురువువలన, యత్=ఏ, జన్మ=పుట్టుకయగుచున్నదో, తత్ = అది, సత్యంవై=యథార్థమైనదియు, తథా=అట్లేప్రకారము, అమృతం = వినాశవర్జితమైనదియు నని చెప్పఁబడుచున్నది.

తా. తల్లిదండ్రులు శరీరమునుమాత్రము కలుగఁజేసెదరు. ఆత్మస్వరూపము కలదిగాదు. ఆత్మకు శరీరద్వయము నసత్యము. గురువువలన ఉపదేశింపఁబడు, పరమార్థభూతమును వినాశవర్జితమును అగు చిత్సదానందాద్వితీయ బ్రహ్మజ్ఞానవిద్యవలన క్రొత్తజన్మము కలుగఁజేయఁబడుచున్నది. ఈక్రొత్తజన్మముచేతనే సత్యజ్ఞానానంతమగు పరబ్రహ్మము తెలియంగనగు. ఆజన్మమే మోక్షకరము. కాబట్టి అజన్మ మమృతమని చెప్పఁబడును. అదియె సత్యమైనది.

స ఆవృణో త్యమృతం సంప్రయచ్ఛన్
తస్మై న ద్రుహ్యేత్కృత మస్య జానన్,
గురుం శిష్యో నిత్యమభివాదయీత
స్వాధ్యాయమిచ్ఛేచ్ఛ సదాఽప్రమత్తః. ౮

టీ. సః=ఆయాచార్యుఁడు, అమృతం=పూర్ణానందమును, సంప్రయచ్ఛన్=ఇచ్చుచు, ఆవృణోతి=పూరించుచున్నాఁడు.—అంతట వ్యాపింపఁ

జేయుచున్నాఁడు. అస్య=వీనిచేత (తృతీయార్థమునఁ వచ్చిన షష్ఠి), కృతం=చేయఁబడినదానిని, జానన్ = ఎఱుంగుచు—ఆత్మకు వీనిచేతనైన యుపకారము నెఱుంగుచు, తస్మై=ఆయాచార్యునికొఱకు, న ద్రుహ్యేత్=ద్రోహము చేయఁగూడదు. నిత్యం=ఎల్లప్పుడు, గురుం=గురువును, శిష్యః=శిష్యుఁడు, అభివాదయీత=నమస్కరింపవలయును.—దేవునివలె చూచుచు ఉపాసింపవలయును, సదా=ఎల్లప్పుడు, అప్రమత్తః=ప్రమాదములేనివాఁడై, స్వాధ్యాయం=విద్యాగ్రహణమును, ఇచ్ఛేత్ చ=కోరనువలయును.

తా. ఆచార్యుఁడు శిష్యుని పూర్ణానందమగు మోక్షముతో నావరింపఁ జేయుచున్నాఁడు. అట్టిమహోపకారిఁగా గురువు నెఱిఁగి, అతనికి శిష్యుఁ డెప్పటికిని ద్రోహము చేయఁగూడదు. అతనికి వందనాదుల నొనర్చుచుఁ దనకు ఆత నుపదేశించిన విద్యను వల్లించుచుండవలయును.

శిష్యవృత్తిక్రమేణైవ విద్యామాప్నోతి యశ్శుచిః,
బ్రహ్మచర్యవ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే. ౯

టీ. శుచిః = పవిత్రుఁడై, శిష్యవృత్తిక్రమేణైవ=శిష్యుఁ డుండవలసిన తీరుతోనే, విద్యాం = బ్రహ్మవిద్యను, ఆప్నోతి ఇతి = పొందడమనుట, యత్=ఏదికలదో,తత్=అది, అస్య బ్రహ్మచర్యస్య=ఈబ్రహ్మచర్యవ్రతము యొక్క, ప్రథమః పాదః=మొదటిపాదమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. గురువును సమీపించి యను అర్థమిచ్చు "ఆచార్యయోనిమిహ" అను అయిదవశ్లోకము మొదలు యీశ్లోకమునందలి "విద్యామాప్నోతియశ్శుచిః" యనువఱకుఁగల యభిప్రాయమంతయు బ్రహ్మచర్యముయొక్క ప్రథమ పాదము.

శుచియై గురువునుసమీపించి, శ్రద్ధాభక్తులతో బ్రహ్మవిద్యాగ్రహణము చేయుట బ్రహ్మచర్యవ్రతప్రథమపాదము.

యథా నిత్యం గురౌ వృత్తిర్గురుపత్న్యాం తథా చరేత్,
తత్పుత్రే చ తథా కుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే. ౧౦

టీ. నిత్యం=ఎల్లప్పుడు, గురౌ=ఆచార్యుని విషయమున, వృత్తిః యథా=నడుచుట ఎట్లో, తథా=ఆరీతిగానే, గురుపత్న్యాం=ఆచార్యునిభార్యవిషయమునను, చరేత్=నడచుచుండవలయును. తథా=అట్లే, పుత్రేషు=ఆచార్యుని పుత్రులయందును, కుర్వన్ (తిష్ఠేత్) ఇతి=చేయుచుండవలయుననుట. ద్వితీయః పాదః=రెండవపాదమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. ఆచార్యునియం దెట్టి శ్రద్ధాభక్తులతో శిష్యుఁడు ప్రవర్తించునో యట్టి శ్రద్ధాభక్తులతో నతనిదారాపుత్త్రులయందుఁగూడ ప్రవర్తించవలయు ననుట బ్రహ్మచర్యవ్రతద్వితీయపాదము.

ఆచార్యేణాత్మకృతం విజానన్
జ్ఞాత్వా చార్థం భావితోఽస్మీత్యనేన,
య న్మన్యతే తం ప్రతి హృష్టబుద్ధిః
స వై తృతీయో బ్రహ్మచర్యస్య పాదః. ౧౧

టీ. ఆచార్యేణ=గురువుచేత, ఆత్మకృతం=తనకు చేయఁబడిన ఉపకారమును, విజానన్=తెలిసికొనుచు, అర్థం=పరమపురుషార్థమైన వేదార్థమును, జ్ఞాత్వా=ఎఱిఁగి, తంప్రతి=ఆచార్యునిగూర్చి, హృష్టబుద్ధిః సన్=సంతోషించిన మనస్సుగలవాఁడై, అనేన=ఈయాచార్యునిచేత, భావితోఽస్మి=స్వాభావిక చిత్సదానందాద్వితీయబ్రహ్మవిద్యోపదేశము కలుగఁ జేయఁబడినవాఁడనైతిని, ఇతి=అని, యత్=ఏది, మన్యతే = తలంచఁబడునో, సః= అది, బ్రహ్మచర్యస్య=బ్రహ్మచర్యవ్రతముయొక్క, తృతీయః పాదః = మూడవపాదము.

తా. ఆచార్యుఁడు తనకు చేసిన ఉపకారము నెల్లప్పుడుం దలపోయుచు, సంతుష్టస్వాంతుండై, ఈమహానుభావునియనుగ్రహంబునం గదా చిత్సదానందాద్వితీయబ్రహ్మవిద్యోపదేశం బెఱుంగఁ జాలితిఁ గృతార్థుండనైతినని భావించుట బ్రహ్మచర్యవ్రతముయొక్క మూడవపాదమనంబడు.

ఆచార్యాయ ప్రియం కుర్యాత్ప్రాణైరపి ధనైరపి,
కర్మణా మనసా వాచా చతుర్థః పాద ఉచ్యతే. ౧౨

టీ. కర్మణా=కార్యముచేతను, మనసా = మనస్సుచేతను, వాచా=వాక్కుచేతను, ప్రాణైరపి = ప్రాణములచేతను, ధనైరపి = ద్రవ్యముచేతనైనను, ఆచార్యాయ=ఆచార్యునికొఱకు, ప్రియం = ప్రీతియగుకార్యమును, కుర్యాత్ (ఇతి యత్)=చేయవలసినదనుట. చతుర్థఃపాదః=(బ్రహ్మచర్యవ్రతముయొక్క) నాలవపాదమని, ఉచ్యతే=చెప్పఁబడినది.

తా. మనోవాక్కాయ కర్మముల నొక్కరూపుగాఁ బ్రాణధనములచేత నైన గురువునకుఁ బ్రియం బొనర్చుట నాల్గవపాదమని భావము.

కాలేన పాదం లభతే తథాఽయం
తథైవ పాదం గురుయోగతశ్చ,
ఉత్సాహయోగేన చ పాద మృచ్ఛేత్
శాస్త్రేణ పాదం చ తతోఽభియాతి. ౧౩

టీ. అయం=వీఁడు, కాలేన=దినములపేరిటఁగలుగు బుద్ధిపరిపాకముచేత, పాదం=నాలవవంతును, తథా=పైచెప్పినరీతిఁగ, లభతే=పొందును. తథైవ=అట్లే, పాదం=నాలవవంతును, గురుయోగతః చ=ఆచార్యునిసంబంధముచేతను, (లభతే=పొందును.) ఉత్సాహయోగేన=బుద్ధివిశేషప్రాదుర్భావముచేత-నిజమేధచేత, పాదం=నాలవవంతును, ఋచ్ఛేత్=పొందును-లభ్యపఱచుకొనును. తతః=పిదప, శాస్త్రేణ = సహాధ్యాయులతో తత్త్వవిచారముచేత, పాదం=(మిగిలిన) నాలవవంతును, అభియాతి=పొందును. ఈశ్లోకమునందు క్రమ మవివక్షితము. వరుస 1. గురుయోగము, 2. ఉత్సాహయోగము, 3. కాలము, 4. శాస్త్రము.

తా. విద్య నాలుగు, నాల్గువిధములుగా నలవడును. ౧. సత్సాంగత్యముచేత బుద్ధిపరిపాకమై విద్యాసక్తికి తగుకాలము. ౨. వెంటనే ఉపదేష్ట్రగురు

సామీప్యము తటస్థించుట. 3. విద్యను సాధించుటయం దుత్సాహవంతుఁడగుట. ౪. సహాధ్యాయులతో చర్చించుటంబట్టి శాస్త్రజ్ఞానము దృఢపడుట యను చతుష్పాదసముల్లసితంబు.

జ్ఞానాదయో ద్వాదశ యస్య రూప
మన్యాని చాఙ్గాని తథా బలం చ,
ఆచార్యయోగే ఫలతీతి చాహు
ర్బ్రహ్మార్థయోగేన చ బ్రహ్మచర్యమ్. ౧౪

టీ. యస్య=ఎవనికి, జ్ఞానాదయః=(ద్వితీయాధ్యాయమందలి పందొమ్మిదవశ్లోకమందు ఉదాహృతమైన) జ్ఞానము మొదలగు, ద్వాదశ = పండ్రెండుగుణములును, రూపం=స్వరూపమో, అన్యాని= (ద్వితీయాధ్యాయమందలియిరువదియైదవ శ్లోకమునందు ఉదాహృతమైన) షడ్విధత్యాగము మొదలైనవి, అఙ్గాని=అవయవములో, తథా = అట్లే, బలంచ=బలమో, తత్=అది, ఆచార్యయోగేన=గురుసంబంధమున, ఫలతి ఇతి చ=ఫలించునని యు, ఆహుః=చెప్పెదరు (తత్ = అదియు). బ్రహ్మార్థయోగేన=బ్రహ్మతత్త్వభావంబుచేత, బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యము (అయిఫలించుచున్నది).

తా. జ్ఞానాదులగు ద్వాదశగుణములును, షడ్విధంబయిన త్యాగంబును, వానిధర్మములను పాలించుసామర్థ్యంబును గురుసాన్నిధ్యంబుననే శుశ్రూషాద్యాచరణచే ఫలించు. బ్రహ్మార్థసంబంధముచేత, స్వాత్మకు, చిత్సదానందాద్వితీయబ్రహ్మైక్య సంపాదనమొనర్చిన, బ్రహ్మచర్యమును ఫలించును.

ఏతేన బ్రహ్మచర్యేణ దేవా దైవత్వ మాప్నువన్,
ఋషయశ్చ మహాభాగా బ్రహ్మచర్యేణ చాభవన్. ౧౫
ఏతేనైవ సగన్ధర్వా రూప మప్సరసోఽజయన్,
ఏతేన బ్రహ్మచర్యేణ సూర్య అహ్నాయ జాయతే. ౧౬

టీ. ఏతేన=ఈ, బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యవ్రతముచేత, దేవాః=దేవతలు, దైవత్వం=దేవభావమును, అప్నువన్=పొందిరి. మహాభాగాః=మాహాత్మ్యము గలవారలు, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్య వ్రతముచేతనే, ఋషయశ్చ=ఋషులును, అభవన్=అయిరి. (బ)సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన, అప్సరసః = అచ్చరలు, రూపాణి = రమణీయములైన రూపములను, ఏతేన=ఈబ్రహ్మచర్యవ్రతముననే, అజయన్=జయించిరి. సూర్యః=సూర్యుఁడు, అహ్నాయ=లోకమును ప్రకాశింపఁజేయుటకై బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్యముచేత, జాయతే చ = పుట్టుచున్నాఁడు.

తా. బ్రహ్మచర్యవ్రతాచరణచే దేవతలు దేవత్వమును, మాహాత్మ్యమును ఋషులు, సౌందర్యమును గంధర్వులు, అచ్చరలు, సూర్యుఁడు లోకప్రకాశమును కలుగఁజేయు సామర్థ్యమును పొందిరి.

ఆకాంక్షార్థస్య సంయోగా ద్రసభేదార్థినామివ,
ఏవం హ్యేతత్సమాజ్ఞాయ తాదృగ్భావం గతా ఇమే. ౧౭

టీ. రసభేదార్థినాం=రసభేదాదుల యపేక్షకులకు, ఆకాంక్షార్థస్య=అపేక్షించిన ప్రయోజనముయొక్క, సంయోగాదివ = కూడికవలనవలె, ఏతత్=దీనిని, ఏవం హి=ఈవిధముగానే, సమాజ్ఞాయ=ఎఱిఁగి, తాదృగ్భావం=అట్టిభావమును, ఇమే=వీరు (దేవతలు, ఋషులు, గంధర్వాప్సరసలు), గతాః=పొందిరి.

తా. చింతామణి మొదలగు వస్తువులు కోరినవారి కోర్కుల నిచ్చునట్లు బ్రహ్మచర్యవ్రతమువలననే దేవత్వము ఋషిత్వము మొదలగునవి వాని వాని నపేక్షించినవారు పొందిరి. (చింతామణిదృష్టాంతము భాష్యములో నుదాహృతము.)

అన్తవన్తః క్షత్రియ తే జయన్తి
లోకాన్ జనాః కర్మణా నిర్మితేన,

జ్ఞానేన విద్వాన్ తేజ అభ్యేతి నిత్యం
న విద్యతే హ్యన్యథా తస్య పన్థాః. ౧౮

టీ. హేక్షత్రియ = ఓరాజా! తే=ఆ, జనాః=నరులు, నిర్మితేన=నిర్మింపఁబడిన లేక చేయఁబడిన, కర్మణా=కర్మచే, అన్తవతః=అంతముగల, లోకాన్=పితృలోక దేవలోకములను, జయన్తి=జయించు చున్నారు—అనన్తమగు, ఆత్మభూతంబైన పరమాత్మ లోకము జయించుటలేదు. విద్వాన్=విద్వాంసుఁడు, జ్ఞానేన=జ్ఞానముచేత, నిత్యం తేజః = అవినాశకమై శాశ్వతమైన తేజస్సును, అభ్యేతి = పొందుచున్నాఁడు. తస్య=అశాశ్వతమైన తేజమును పొందుటకు, అన్యథా=(బ్రహ్మచర్యముతప్ప) వేఱొక, పన్థాః=మార్గము, న విద్యతే=లేనేలేదు.

తా. కర్మ నశించునట్టి ఫలముల నిచ్చును. కర్మలు చేయువారలు శాశ్వతమైన ఫలమగు మోక్షమును పొందలేరు. జ్ఞానులు శాశ్వతమును తేజోరూపంబునైన పరబ్రహ్మను పొందుదురు. కాఁబట్టి మోక్షసాధనమునకు జ్ఞానమార్గమే ప్రధానము. అన్యము లేనే లేదనుట.

ధృతరాష్ట్ర ఉవాచ.—

ఆభాతి శుక్లమివ లోహిత మివాథో
కృష్ణ మివార్జునం కాద్రవం వా,
యద్బ్రాహ్మణః పశ్యతి యత్ర విద్వాన్
కథంరూపం తదమృత మక్షరం పరమ్. ౧౯

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడనుచున్నాఁడు.—

టీ. యత్ర=ఎక్కడ, విద్వాన్=పండితుఁడగు, బ్రాహ్మణః=బ్రహ్మవేత్త, యత్=దేనిని, పశ్యతి=చూచుచున్నాఁడో (తత్ర=అచ్చట), అమృతం=మరణ రాహిత్యముగలదియు, అక్షరం=నశింపనిదియు అగు, పరం=బ్రహ్మ, శుక్లమివ=తెల్లని దానివలె, ఆభాతివా=ప్రకాశించునా? లోహితమివ=

ఎఱ్ఱనిదానివలె, (ఆభాతివా = ప్రకాశించునా?) అథో=ఇఁక, కృష్ణం= నల్లనిదా? ఆర్జునం=బూడిదవర్ణమా? కాద్రవంనా = పచ్చనిదా?

తా. బ్రహ్మజ్ఞాని పొందునట్టి పరతత్త్వమునకు రూపముకలదా? అది నలుపా?ఎఱ్ఱనిదా?తెల్లగాఁగాని పచ్చగాఁగాని, బూడిదరంగు గలదిగాఁగాని ఉండునాయని ధృతరాష్ట్రుఁడు సనత్సుజాతుని నడిగెను.

సనత్సుజాత ఉవాచ.—

నాభాతి శుక్లమివ లోహిత మివాథో
కృష్ణ మథార్జునం వా కాద్రవం వా,
న పృథివ్యాం తిష్ఠతి నాన్తరిక్షే
నైతత్సముద్రే సలిలం బిభర్తి. ౨౦

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. శుక్లమివవా=తెల్లనిదానివలెగాని, లోహితం ఇవవా=ఎఱ్ఱనిదాని వలెగాని,అథో=ఇంకను,కృష్ణం=నల్లనిదిగాగాని,అథ=వెనుక, అర్జునంవా= తెలుపు నలుపు గలసినదిగాగాని, కాద్రవంవా=పచ్చనిదిగాగాని, నాభాతి (ఆపరబ్రహ్మము) ప్రకాశింపదు. పృథివ్యాం=భూమియందు, న తిష్ఠతి=ఉండదు,అంతరిక్షే=ఆకసమునందు, న=లేదు. ఏతత్=ఇది, సముద్రే=సముద్రమునందలి, సలిలం=జలమును,నబిభర్తి=భరింపదు (సంసారమునందలి పంచభూతాత్మకమైన శరీరమును భరించదు అనుట). సముద్రమునకు సంసారమును, జలమును, పంచభూతప్రత్యామ్నాయముగను చెప్పుట వేదకర్తల కాచారము. ఇయ్యది సనత్సుజాతమహర్షిప్రోక్తమగుటచే నీసంప్రదాయ మిచ్చట నీ శ్లోకమునం దుదాహరింపఁ బడినది.

తా. పరతత్త్వము ఎరుపు, తెలుపు, మొదలగు వన్నెలు గలదికాదు. అది యాకసంబునఁగాని, భూమియందుఁగాని లేదు. పంచభూతాత్మకంబు గాదు. అట్లుండినదానికి రూప ముండ వలయును. రూప ముండు వస్తువులు

నశించునవి. కలుగునవి. పరబ్రహ్మకు ఇందుకు వ్యతిరిక్త లక్షణము లున్నవని చక్కగా నుపన్యసింప బడియుండుటంబట్టి అది ప్రపంచాతీతమును, రూప రాహిత్యము గలదియునై యున్నది.

నైవర్క్షు తన్నయజుష్షు నాప్యథర్వసు
న దృశ్యతే వై విమలేషు సామసు,
రథన్తరే బార్హతే వాఽపి రాజన్
మహావ్రతస్యాత్మని దృశ్యతే తత్. ౨౧

టీ. హేరాజన్ = ఓరాజా! తత్ = అపరబ్రహ్మము, ఋక్షు = ఋగ్వేదఋక్కులందు, న దృశ్యతే = కనంబడదు. న యజుష్షు=యజుర్వేదమునందును కనంబడదు. న అపి అథర్వసు = అథర్వవేదంబులందును కనం బడదు. విమలేషు = నిర్మలములగు, సామసు = సామవేదములందును, న= కనంబడదు. రథన్తరే బార్హతే వాపి=రథన్తరసామమునందుగాని, బార్హద్రథసామమునందుగాని, నదృశ్యతే = కనంబడదు (తత్ =అపరబ్రహ్మము). మహావ్రతస్య=ద్వాదశమహావ్రతములతోఁగూడిన బ్రహ్మవిదునకు, ఆత్మని= ఆత్మయందే, దృశ్యతే = (అద్వైతముగ) తోఁచును.

తా. అపరబ్రహ్మము ఋగ్వేదఋక్కులందుగాని, యజుర్వేదసామ వేదంబులందుగాని, అథర్వవేదమంత్రంబులందుగాని, సామవేదంబులగు రథంతర బార్హద్రథాదులందుగాని లేదు. ద్వాదశమహావ్రతముల నాచరించు బ్రహ్మవిదునకు ఆత్మయందే తోఁచును. ఇయ్యది నిశ్చయము.

అవారణీయం తమసః పరస్తాత్
తదన్తతోఽభ్యేతి వినాశకాలే,
అణీయరూపంచ తథాఽప్యణీయసాం
మహత్స్వరూపం త్వపి సర్వతేభ్యః. ౨౨

టీ. తత్=అపరబ్రహ్మము, తమసః = (అజ్ఞానమువలననైన) సంసారమునకు, పరస్తాత్ = బయటనున్నది. అన్తతః=కొనకు, వినాశకాలే = (జగత్తుయొక్క) ప్రళయకాలమునందు, అవారణీయం = (సర్వాంతర్యామి యగుటచే) వారించుటకు శక్యముకానిదై, అభ్యేతి = పొందుచున్నది. తథాపి = అటులైనను, అణీయసాం=(అపరబ్రహ్మము) అణువులలో, అణీయరూపం పరమాణురూపమయినదగుచున్నది. పర్వతేభ్యః=కొండలకంటె, మహత్స్వరూపంతు అపి = గొప్పస్వరూపముగలదియు (అగుచున్నది.)

తా. పరబ్రహ్మప్రాప్తి సంసారమునకు చేరదు. జ్ఞాని దేహపాతమునందుగాని పరబ్రహ్మప్రాప్తిఁ జెందఁడు. అపరబ్రహ్మప్రాప్తి మోక్షమునాబడు. మోక్షము అణుస్వరూపమునకంటె మిక్కిలి సూక్ష్మము. పర్వతములకంటె మిక్కిలి గొప్పయాకారము గలదియు.

త దేత దహ్నా సంస్థితం భాతి సర్వం
తదాత్మవి త్పశ్యతి జ్ఞానయోగాత్,
తస్మిన్ జగత్సర్వమిదం ప్రతిష్ఠితం
య ఏతద్విదు రమృతా స్తే భవన్తి. ౨౩

టీ. తత్ = ఆ, ఏతత్ = ఈపరబ్రహ్మము, (సమస్తమైనజగత్తును). అహ్నా = ప్రకాశమానమైనరూపముతో - తేజోరూపముతో, సంస్థితం = ఉండి, భాతి = ప్రకాశించుచున్నది. తత్ = ఆబ్రహ్మమును, ఆత్మవిత్ = బ్రహ్మవేత్త, జ్ఞానయోగాత్ = జ్ఞానసంబంధమువలన (కర్మయోగమువలన కాదనుట), పశ్యతి=చూచుచున్నాఁడు. తస్మిన్=అపరమాత్మయందు, ఇదం =ఈ, సర్వం జగత్=సమస్తప్రపంచము, ప్రతిష్ఠితమ్=ఉన్నది. యే=ఎవరు, తత్=అపరబ్రహ్మమును, విదుః=తెలిసియుందురో, తే=వారు, అమృతాః= మోక్షమును జెందువారు, భవన్తి=అగుచున్నారు.

తా. అపరబ్రహ్మ మెల్లప్పుడు ప్రకాశమానమైనది. దానిని బ్రహ్మవేత్త జ్ఞానముచేఁ దెలియును. ఈజగత్తున కాధార మాధర్మము. మోక్షార్థులీవిషయమును తెలియనివారు కారు.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం
వైయాసిక్యా ముద్యోగపర్వణి ధృతరాష్ట్రసనత్కు-
మారసంవాదే శ్రీమ*త్సనత్సుజాతీయే
తృతీయోఽధ్యాయః.

---

* సనత్సుజాతీయ తృతీయాధ్యాయానన్తరము అన్తిమాధ్యాయపూర్వము ౨౧ శ్లోకములతో నొక అధ్యాయము కొన్నిప్రతులయందు కానంబడుచున్నది. ఆయధ్యాయమునకు శ్రీశఙ్కరకృతభాష్యము కూడ నున్నట్లు చెన్నపురి ప్రాంతపువ్యాఖ్యప్రతియు గూడ నున్నది. అయినప్పటికిని ఆ వ్యాఖ్యానమునకును నీలకంఠీయవ్యాఖ్యానమునకును లేశమాత్రభేదము కనఁబడలేదు. కాబట్టి నీలకంఠీయవ్యాఖ్యానమే శ్రీశఙ్కరవిరచితముగా నెన్ని ముద్రితమైనట్టు కనఁబడుచున్నది. ఈ యిరువదియొక్క శ్లోకములందు వ్యాహృతవిషయము ద్వితీయ తృతీయ అధ్యాయములందు లెస్సగా ప్రబోధించి యుండునవేగాని క్రొత్తవిషయము లేవియు లేవు. కాన మైసూరు ప్రాగ్దేశ పుస్తకభాండాగారాధికారయాజమాన్యముచే నచ్చొత్తించిన విద్వాంసులు మ-రా-రా-జశ్రీ, బ్రహ్మశ్రీ, అ. మహాదేవశాస్త్రిలవారీ యధ్యాయము ప్రక్షిప్త మనివదలినారు. "Sacred books of the East" సంపాదకులగు మాక్సుముల్లరు ఆధిపత్యమున శ్రీయుత కాశీనాథత్ర్యంబకతెలంగుగారీ యిరువదియొక్క శ్లోకములను తర్జుమా చేసియున్నారు. వీరు విశేషముగా శ్రీనీలకంఠవిరచితవ్యాఖ్యానము ననుసరించినవారే కాబట్టి యీశ్లోకములను గ్రహించిరి. ప్రక్షిప్తమని మాకు తోఁచినందున దీని నిచ్చట వదలినారము.

# చతుర్థోఽధ్యాయః.



యత్తచ్ఛుక్రం మహాజ్యోతి ర్దీప్యమానం మహద్యశః,
యద్వై దేవా ఉపాసతే యస్మా దర్కో విరాజతే. ౧
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్.

టీ. యత్=దేనిని-అనఁగా బ్రహ్మవేత్త జ్ఞానయోగమువలన దేనిని తెలిసికొనునో, అట్లు తెలిసికొనినపిమ్మట అమృతత్వమును పొందునో, తత్=తచ్ఛబ్దవాక్యమును, శుక్రం=అవిద్యాదిదోషరహిత మగుటంజేసి పరిశుద్ధమైనదియు, మహాజ్యోతిః=గొప్ప తేజోరూపమయినదియు, దీప్యమానం=ప్రకాశించునదియు, మహద్యశః=గొప్పకీర్తిఁగలదియునై యున్నదో, యత్=దేనిని - ఏబ్రహ్మమును, దేవాః=ఇంద్రాదులయిన దేవతలు, ఉపాసతే=ఉపాసించెదరో, యస్మాత్=దేనివలన, అర్కః=సూర్యుఁడు, విరాజతే=వెలుఁగుచున్నాఁడో, సనాతనం=పురాతనుఁడగు, తం=ఆ, భగవన్తం=పరమాత్మను, యోగినః (ఏవ)=యోగులే, ప్రపశ్యన్తి=చూచుచున్నారు.

తా. పరమాత్మ, పరబ్రహ్మ, పరమేశ్వరుఁడు ఈమూడుశబ్దములును పర్యాయపదములుగా నిందు వాడఁబడుచున్నవి. పరమాత్మ తచ్ఛబ్దముచేత చెప్పఁబడువాఁడు, గొప్ప తేజోరూపుఁడు, ప్రకాశించువాఁడు, గొప్పకీర్తిఁగలవాఁడు. ఇంద్రాదిదేవతలందఱును ఆపరబ్రహ్మ నుపాసించెదరు. ఆపరమాత్మ అపరిమితమై ప్రకాశించువాఁడు. తనకాంతిచేతనే సూర్యుని ప్రకాశింపఁ జేయువాఁడు. యోగులు తప్ప ఆపురాణపురుషుని నెవరును ఎఱుంగలేరు.

శుక్రా ద్బ్రహ్మ ప్రభవతి బ్రహ్మ శుక్రేణ వర్ధతే,
తచ్ఛుక్రం జ్యోతిషాం మధ్యే తప్తం తపతి తాపనమ్,

యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౨

టీ. శుక్రాత్=పరిశుద్ధుఁడగు పరబ్రహ్మవలన, బ్రహ్మ = హిరణ్యగర్భుఁడను బ్రహ్మము, ప్రభవతి=పుట్టుచున్నది. బ్రహ్మ= ఆహిరణ్యగర్భుఁడను బ్రహ్మము, శుక్రేణ=పరిశుద్ధుఁడగు పరబ్రహ్మముచేతనే, వర్ధతే=వృద్ధిపొందుచున్నది. తత్ శుక్రం=అపరబ్రహ్మము, జ్యోతిషాంమధ్యే=ఆదిత్యాదులగు జ్యోతిస్సులలోపల (తైః=వానిచేత), అతప్తం = ప్రకాశమానమును పొందకయె, తాపనం=ప్రకాశత్వకమునుపొంది, తపతి=ప్రకాశించుచున్నది కొఱవపూర్వశ్లోకమున తెలిసికొనన గు.

తా. పరమాత్మసంకల్పముచేత హిరణ్యగర్భుఁ డుద్భవిల్లెను. ఈహిరణ్యగర్భుఁ డనుబ్రహ్మము పరమాత్మ చేతనే వృద్ధిని పొందుచున్నాఁడు. పరమాత్మ ఆదిత్యాదులమధ్యనుండి వానికి ప్రకాశత్వమును కలుగఁజేయుచు, స్వయంప్రకాశతవలన వెలుఁగుచున్నాఁడు. కాని ఆదిత్యాదులకాంతివల్ల తాను ఎంతమాత్రము ప్రకాశించువాఁడు కాఁడు. అని యోగులు తెలిసికొనుచున్నారు.

పూర్ణాత్పూర్ణముద్ధరన్తి పూర్ణాత్పూర్ణం ప్రచక్షతే,
హరన్తిపూర్ణా త్పూర్ణంచ పూర్ణేనై వావశిష్యతే,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనం. 3

టీ. పూర్ణాత్ = దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నుఁడగు పరబ్రహ్మమువలన, పూర్ణం=పూర్ణుఁడగు జీవుని, ఉద్ధరన్తి =జీవరూపముతో నుద్ధరించుచున్నారు. పూర్ణాత్=పూర్ణుఁడగు పరబ్రహ్మమువలన వృద్ధిబొందిన జీవస్వరూపియగుటవలన, పూర్ణం= (హిరణ్యగర్భుని) పూర్ణునిగా, ప్రచక్షతే=(విద్వాంసులు) పలుకుచున్నారు. పూర్ణాత్=పూర్ణుఁడైన జీవునియందుండి, పూర్ణంచ హరన్తి=పరమాత్మను హరించుచున్నారు. పూర్ణేన ఏవ=పరబ్రహ్మస్వరూపముచేతనే, అవశిష్యతే=మిగులుచున్నది. కొఱవ మొదటశ్లోకమున వివక్షితము.

తా. పూర్ణుఁడనంబడు పరబ్రహ్మము దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నుఁ డగుటవలన జీవులనుత్పత్తిఁ జేయుచున్నాఁడు. ఆజీవులు పరబ్రహ్మస్వరూప ములే కాని వేఱుకావు. వానిని విద్వాంసులును అట్లే నుడివెదరు. ఈజీవుఁ డు దేహేంద్రియాదులందుండియు స్థూలసూక్ష్మదేహములనుండియు వెలు పలికి తీయఁబడుచున్నాఁడు. అట్లు చేసినపిమ్మట అనగా దేహేంద్రియములు స్థూలసూక్ష్మాది శరీరములయం దునికిలేకపోయినప్పుడు వెలుంగుపదార్థము పరిశుద్ధమైన పరబ్రహ్మమే యని భావము. ఈభావమును యోగులు తప్ప నితరులెవ్వరు నెఱుంగఁజాలరు.

ఆపోఽథా ద్భ్యస్సలిలం తస్య మధ్యే
ఉభౌ దేవౌ శిశ్రియాతేఽన్తరిక్షే,
ఆదధ్రీచీ స్సవిషూచీ ర్వసానా
వుభౌ బిభర్తి పృథివీం దివం చ,
యోగిన్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనం. ౪

టీ. (పరమాత్మనః=పరబ్రహ్మవలన), ఆపః=పంచభూతములు, (సృష్టాః=సృజింపఁ బడినవి), అథ=పిమ్మట, అద్భ్యః=పంచభూతములవలన, సలిలం = స్థూలదేహము—భూతపంచక సంబంధమైన శరీరమనుట. (సృష్టం=సృజింప(బడినది) తస్య=ఆశరీరముయొక్క, మధ్యే=నడుమనుండు, అన్తరిక్షే=హృదయాకాశమునందు, ఉభౌ=ఇద్దఱగు, దేవౌ=ప్రకాశించు స్వభావముగల దేవతలు, శిశ్రియాతే=వసించియున్నారు. సవిషూచీః=సైది క్కులతో చేరిన, ఆదధ్రీచీః = అన్నిదిక్కులను, వసానౌ=ఆవరించియున్న, ఉభౌ=ఆదేవత లిరువురు, పృథివీం=భూమిని, దివం చ=ఆకసమును, బిభర్తి =భరింపుచున్నారు. కొఱవ మొదట శ్లోకమున వివక్షితము.

తా. పరమాత్మవలన పంచభూతము లుత్పన్నమైనవి. పంచభూతా త్మక మీశరీరము. శరీరమునందలి హృదయాకాశము జీవపరమాత్మ లావ రించియున్నారు. జీవుఁడు పరమాత్మవలన వృద్ధిఁ బొందినవాఁడై దేహము

తనను నావరించి విస్మృతిజెంది తానే దేహము అనియున్నాఁడు; పరమాత్మ హృదయాకాశమందేగాక అంతట స్వయంప్రకాశముతో వెలుంగుచున్నాఁడు. జీవునికి విస్మృతి కలదు. పరమాత్మున కట్టియవస్థ లెప్పుడును లేవను నీ భావమును యోగులు తప్ప నితరు లెవ్వ రెఱుంగరు.

చక్రే రథస్య తిష్ఠన్తం ధ్రువస్యావ్యయకర్మణః,
కేతుమన్తం వహన్త్యశ్వా స్తం దివ్యమజరం దివి,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౫

టీ. అవ్యయకర్మణః=నాశములేని స్వభావముఁగలదియు, ధ్రువస్య=ఎల్లప్పు డుండునదియునైన, రథస్య=రథముయొక్క, చక్రే=చక్రమునందు, తిష్ఠన్తం=ఉండునట్టియు, కేతుమన్తం=ప్రజ్ఞావంతుం డగుటచే, దివ్యం=అప్రాకృతుఁడును — జరామరణాది వివర్జితుఁడును, అజరం=ముదిమిలేని, తం=ఆపరబ్రహ్మను, దివి=ఆకసమున, అశ్వాః=(ఇంద్రియ రూపములగు) గుఱ్ఱములు, వహన్తి=నడుపుచున్నవి. కొఱవ మొదటిశ్లోకమున వివక్షితము.

తా. అశ్వాదులు రథమును సరియగు సారథియుండగా నెట్లు క్రమమైన దారియందు నడుచునో అదేరీతిగా ప్రజ్ఞావంతుఁడగు జీవుఁడు ఇంద్రియేచ్ఛాగతుఁడుగాక, స్వయంప్రకాశమానుఁడై పరమేశ్వరునియందే బుద్ధి నిలిపి, క్రమేణ తాను పరమాత్మయం దైక్యమగు నని భావము. దీనిని యోగులు తప్ప నితరు లెవ్వరెఱుంగఁ జాలరు.

న సాదృశ్యే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చిదేనమ్,
మనీషయాఽథో మనసా హృదా చ
య ఏనం విదురమృతాస్తే భవన్తి,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనం. ౬

టీ. అస్య=ఈపరమాత్మయొక్క, రూపం=రూపములేక ఆకారము, సాదృశ్యే=సామ్యములో - పోలికలో, న తిష్ఠతి=లేదు. ఏనం=వీనిని, కశ్చి

దపి=ఒక్కఁడైనను, చక్షుషా=దేహేన్ద్రియమగు నేత్రములతో, న పశ్యతి=చూడలేఁడు. మనీషయా=బుద్ధిచేతను, మనసా=మనస్సుచేతను, హృదా చ=హృదయముచేతను, యే=ఎవరు,ఏనం=ఈపరబ్రహ్మను, విదుః=ఎఱుఁగుదురో, తే=వారలు, అమృతాః = మృతిలేనివారలు, భవన్తి = అయ్యెదరు. కొలిమొదటి శ్లోకమున వివక్షితము.

1. మనీష=అధ్యవసాయాత్మికబుద్ధి.

2. మనస్సు అనగా సంకల్పవికల్పాత్మక మైనది.

తా. పరబ్రహ్మస్వరూపముతోఁబోల్చి చెప్పఁదగిన యాకారము ఏదియు లేదు. ఇతని యాకారము నేత్రేంద్రియములతో శరీరులు చూడలేరు. అధ్యవసాయాత్మికమైన బుద్ధిచేతను, సంకల్ప వికల్పాత్మికమైన మనస్సుచేతను, హృదయస్థుఁడగుటంబట్టి హృదయముచేత నెవ్వరెఱుంగుదురో వారలే మోక్షార్హు లని యోగులు తప్ప నితరులెవ్వ రెఱుంగం జాలరు.

ద్వాదశ పూగాస్సరితో దేవరక్షితాః
మ ధ్వీశతే తదా సంజ్వరన్తి ఘోరమ్,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 2

టీ. దేవరక్షితాః=పరబ్రహ్మచే కాపాడఁబడినవియు, సరితః=సరణశీలములగు, అనగా అాతటను వ్యాపించునవియు అగు, ద్వాదశపూగాః = మనోబుద్ధులతోఁ గూడిన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు పండ్రెండు ఇంద్రియసమూహములు, మధు=విషయమను తేనెను, తదా=అప్పుడు, ఈశతే=పొందుచున్నవి. ఘోరం=సంసారమును, సంజ్వరన్తి=అనుసరించుచున్నవి.

తా. మనోబుద్ధులును, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములును శరీరమును వ్యాపించి పరబ్రహ్మచే రక్షింపఁబడుచున్నవి. ఎవఁడు తన యింద్రియవ్యాపారములను స్వేచ్ఛగా ప్రవర్తించునట్లు చేయుచుండునో వాఁడు ఘోరమైన సంసారసముద్రమున మునుఁగుచుం దేలుచుండును. కాఁబట్టి ఇంద్రియములను తమవిషయములలో ప్రవర్తింపనీయక జాగరూకుఁడై యుండువాఁడె

మోక్షమును పొందఁగలఁడను నంశము యోగులే యెఱుంగుదురు. ఇతరు లెవ్వ రెఱుంగఁజాలరు.

ద్వాదశపూగములు:—కర్మేంద్రియములు ౫, జ్ఞానేంద్రియములు ౫, మనస్సు ౧, బుద్ధి ౧ అని గ్రహించవలయును.

తదర్ధమాసం పిబతి సంచితం భ్రమరో మధు,
ఈశానస్సర్వభూతేషు హవిర్భూత మకల్పయత్,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనం. ౮

టీ. భ్రమరః=తేనెటీగ, అర్ధమాసం = పక్షమునందు, సంచితం= కూడఁబెట్టిన, మధు = తేనెను, (అర్ధమాసం = వెనుకటిపక్షమున) పిబతి = త్రాగును; ఈశానః = పరబ్రహ్మము, సర్వభూతేషు=సర్వభూతములయందు, హవిః=(తత్తత్కర్మానుసరణమైన) అన్నాదికమును,అకల్పయత్=చేసెను.

తా. సర్వదా జననమరణములు గల సంసారి అనగా జీవుఁడు, భ్రమర మెట్లు పూర్వపక్షమునఁగూడఁబెట్టిన తేనెను అపరపక్షమున ననుభవించునో, ఆదేరీతిగ తనపూర్వజన్మ సంచిత సుకృత దుష్కృతములను పరజన్మమున ననుభవించును. ఇట్లనుభవింపఁజేయువాఁడు పరమాత్మయే. దీనిని యోగులు తప్ప నితరులెవ్వ రెఱుంగఁజాలరు.

హిరణ్యపర్ణ మశ్వత్థ మభిపత్య హ్యపక్షకాః,
తత్ర తే పక్షిణో భూత్వా ప్రపతన్తి యథాసుఖమ్,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౯

టీ. అపక్షకాః = జ్ఞానపక్షరహితులు (అజ్ఞానులు), హిరణ్యపర్ణం= బంగారాకులుగల,అశ్వత్థం=రావిచెట్టును(లేక రమణీయమైన ఆకులు గలదగుటచే హిరణ్యమనియును, ఆట్టియాకులుగలది అశ్వత్థమనియును భాష్యము.) అభిపత్య=పొంది, తే=అవి(అజ్ఞానులు), తత్ర=అచ్చట, పక్షిణః=ఱెక్కలు గలవి (జ్ఞానముగలవారు, అనగా బ్రాహ్మణాదిజన్మములచే జ్ఞానసంపన్నులు అని భాష్యము.) భూత్వా=ఆయి, యథాసుఖం = సంతోషముతో, ప్రపతన్తి=సంచరించుచున్నారు. (ముక్తులగుచున్నారు.)

తా. అజ్ఞానులు ఛందఃపర్ణములుగల జ్ఞానవృక్షమును జేరి జ్ఞానులయి యెట్లు ముక్తులగుదురో దానిని యోగులు తప్ప నితరులెవ్వరు నెఱుంగఁజాలరు.

అపానం గిరతి ప్రాణః ప్రాణం గిరతి చంద్రమాః,
ఆదిత్యో గిరతే చన్ద్ర మాదిత్యం గిరతే పరః,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౧౦

టీ. ప్రాణః=ప్రాణము, అపానం=అపానమును, గిరతి=ఉపసంహారము చేయుచున్నది - మ్రింగుచున్నది. చంద్రమాః=చంద్రుఁడు, ప్రాణం=ప్రాణమును, గిరతి=మ్రింగుచున్నాఁడు. ఆదిత్యః=సూర్యుఁడు, చంద్రం=చంద్రుని, గిరతే=మ్రింగుచున్నాఁడు. పరః=పరబ్రహ్మ, ఆదిత్యం=సూర్యుని, గిరతే=మ్రింగుచున్నాఁడు.

మనస్సున కధిదైవతము చంద్రుఁడు.

బుద్ధి కధిదైవతము ఆదిత్యుఁడు. అనగా సూర్యుఁడు.

పరుఁడనగా పరబ్రహ్మ. అదియె పరమాత్మ, పరమేశ్వరుఁడు.

తా. యోగవేళయందు అపానమును ప్రాణమునందును, ప్రాణమును మనస్సునందును, మనస్సును బుద్ధియందును, బుద్ధిని పరమాత్మయందు నుపసంహారముచేసి యనగా చేర్చి స్వాభావికచిత్సదానందాద్వితీయబ్రహ్మస్వరూపియై యుండవలయును-అనుభావమును యోగులే యెఱుంగుదురు.

ఏకం పాదం నోత్క్షిపతి సలిలాద్ధంస ఉచ్చరన్,
తం చేత్సతత ముత్క్షిప్యేత్ న మృత్యుర్నామృతం భవేత్,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౧౧

టీ. హంసః=పరమాత్మ, సలిలాత్ = భూతభౌతిక లక్షణవంతమగు సంసారమునుండి, ఉచ్చరన్=ఊర్ధ్వముగా సంచరింపుచు—సంసారమునుండి వెలుపలనే ప్రవర్తించుచు, ఏకంపాదం=జీవుఁడను ఒకపాదమును, నఉత్క్షిపతి = ఉపసంహరింపఁడు. తం=ఆజీవుఁడను ఒకపాదమును, ఉత్క్షి

పేత్ చేత్ = పైకెత్తినయెడల, మృత్యుః=మృత్యువు, న=లేదు. అమృతం= న=లేదు.

తా. అవిద్యను పోఁగొట్టువాఁడు కాబట్టి పరబ్రహ్మము హంస యని చెప్పఁబడుచున్నాఁడు. పరబ్రహ్మము పాదరూపముతో జీవాత్ముఁడై, త్రిపాదరూపముతో స్వాభావికచిత్సదానందాద్వితీయపరబ్రహ్మమయి యుండుట యోగులే యెఱుంగుదురు. పరబ్రహ్మ జీవుఁడై యంతటను తిరుగుచున్నాఁడు. ఆపాదమును పరబ్రహ్మ ఉపసంహారము చేయునెడల, సంసారమే యుండదు. సంసారమెప్పుడు లేదో దానిని వదలిపెట్టుటయను మోక్షము కూడ కలుగనే కలుగదు.

అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
లిఙ్గస్య యోగేన స యాతి నిత్యమ్,
త మీశ మీడ్య మనుకల్ప మాద్యం
పశ్యన్తి మూఢా న విరాజమానమ్.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౧౨

టీ. అంతరాత్మా=సచ్చిదానందాద్వితీయుఁడగు సర్వభూతాన్తర్గతుఁడైన,పురుషః=పూర్ణుఁడైన పరమాత్మ,లిఙ్గస్యయోగేన=సూక్ష్మశరీరసంబంధముచేత, అఙ్గుష్ఠమాత్రః = అఙ్గుష్ఠమాత్రపరిమాణపరిచ్ఛిన్నుఁడై, నిత్యం = ఎల్లప్పుడు, యాతి=(సంసారమును) పొందుచున్నాఁడు. తం ఈశం=(లింగయోగముచే నంగుష్ఠమాత్రుఁడై సంసారమునుపొందు)ఆయీశ్వరుఁడును, ఈడ్యం=స్తుతింపఁదగినవాఁడును, అనుకల్పం=సర్వమునందు ప్రవేశించి కల్పించువాఁడును, ఆద్యం=ఆదిభవుఁడును, విరాజమానం=దీపించుచున్న, తం=వానిని-అపరబ్రహ్మను, మూఢాః=మూఢులు, న పశ్యన్తి=చూడలేరు. కాఁబట్టి మొదటి శ్లోకమున వివక్షితము.

తా. లింగశరీరసంబంధియై పరబ్రహ్మము సంసారమును వ్యాపించి యుండును. అజ్ఞానులు దీనిని ఎఱుంగఁజాలరు. యోగులే ఎఱుంగుదురు. ఆపురాణపురుషుని యోగులు తప్ప మఱెవ్వరును నితరు లెఱుంగఁజాలరు.

అగు, జనాః=జనులు, విమూఢాః = మూఢాత్ములై, విభ్రమ్యన్తి = మోహమును పొందుదురు. తైః=వానిచేత, దత్తాః=ఇయ్యఁబడిన, భోగాః= విషకల్పములగు విషయములు, భయాయ = భయమును కలుగఁజేయునవై, మోహయన్తే=మోహమును కలుగఁజేయుచున్నవి.

తా. సర్పములు తమబారిని బడువారిని గఱచి చంపి వెంటనే తమ పుట్టలందు దాగియుండులాగున తమవలను బడిన మనుజులను ఇంద్రియములు లోఁబఱచుకొని విషయాసక్తులనుగాఁ జేసి తాము దాఁగి యుండును. విషయలోలురగు మూఢులు మోహితు లీరీతిగనే యగుచున్నారు. ఈవ్యామోహము భయజనకము. దీనిని స్పష్టముగా యోగులు తప్ప మరియెవ్వరు నెఱుంగఁజాలరు. మూఢులిట్లింద్రియలోలురై ప్రవర్తింపఁగా సాక్షిభూతుఁడైయుండు ఆపురాణపురుషునిభగవంతుని యోగులేయెఱుంగుదురు.

అసాధనా వాపి ససాధనా వా
సమానమేత ద్దృశ్యతే మానుషేషు,
సమాన మేత దమృత స్యేతరస్య
యుక్తా స్తత్ర మధ్వ ఉత్సం సమాప్తుః.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౧౪

టీ. అసాధనావాఽపి=శమదమాదిసాధనరహితులైనను, ససాధనావాఽపి=శమదమాది సాధన సహితులైనను, మానుషేషు=మనుజులయందు, ఏతత్=ఈ యాత్మస్వరూపము, సమానం=సాధారణాత్మస్వరూపముగా, దృశ్యతే=చూడఁబడుచున్నది. ఏతత్=ఇది, అమృతస్య=మోక్షమునకును, ఇతరస్య=సంసారమునకును, సమానం=సమానము. తత్ర=అప్పుడు, యుక్తాః = శమదమాదిసాధనయుక్తుఁడు, మధ్వః=పరమపదమగునాతేనెను, ఉత్సం సమాప్తుః=పూర్ణానందబ్రహ్మప్రాప్తిఁగాఁ గ్రోలెదరు— అనగా చెందెదరు.

తా. ఈ యాత్మస్వరూపము శమదమాదిసాధనసంపదగలవారికిని, అది లేనివారికిని సమానముగనే యుండును. మోక్షమునకును, సంసారమున

కను ఆత్మస్వరూప మొక్కటియె కావున సాధనసంపత్తి నలవరించుకొనుచేని, నరుఁడు మోక్షమును చెందును. అట్లు పూర్ణానందబ్రహ్మప్రాప్తి చెందునట్టి పరబ్రహ్మస్వరూపమును పురాణపురుషుని యోగులే యెఱుంగుదురు.

ఉభా లోకా విద్యయా వ్యాప్య యాన్తి
తదాహుతం చాహుత మగ్నిహోత్రమ్,
మా తే బ్రాహ్మ్య లఘుతా మాదధీత
ప్రజ్ఞానం స్యా న్నామ ధీరా లభన్తే,
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౧౫

టీ. ఉభా లోకా=ఇహలోకపరలోకములును, విద్యయా=బ్రహ్మవిద్యచేత, లేక బ్రహ్మాత్మతత్త్వవిద్యచేత, వ్యాప్య=పొంది, యాన్తి=పూర్ణానందబ్రహ్మను పొందుచున్నారు - (ఏవిధముగా బ్రహ్మవిద్యచేత నుభయలోకప్రాప్తిఁ జెందెదరో,ఆదేవిధముగా). తదా=అప్పుడు, అహుతం=హోమముచేయఁబడని, అగ్నిహోత్రం=అగ్నిహోత్రముకూడ, హుతం=హోమముచేయఁబడినది. భవతి=అగుచున్నది. తే=నీకు, బ్రాహ్మీ=బ్రహ్మవిషయవిద్య, లఘుతాం=లఘుత్వమైన మనుష్యభావమును, మాదధీత=కలుగఁజేయకపోవును గాక. ధీరాః=ధీమన్తులు, (యత్=ఏది), ప్రజ్ఞానమ్ నామస్యాత్=ప్రజ్ఞానమనునదై యున్నదో - (తమఃపారమును లేక పరబ్రహ్మను ఆత్మతో పొందించి యనగా బ్రహ్మవిద్యాప్రాప్తిచేత పరమాత్మ యనునది పొందుచున్నదని స్పష్టార్థము.) తత్=దానిని, లభన్తే=పొందుచున్నారు.

తా. బ్రహ్మజ్ఞానముచేత మనుజుఁడు ఇహపరలోకములఫలమును జెందును. అగ్నిహోత్రాదికర్మలను చేయకపోయినను, అందువలన నగుఫలములఁ దప్పక చెందును. బ్రహ్మజ్ఞానముచేత మర్త్యత్వప్రాప్తి లేదు. అని యోగు లెఱుంగుదురు. ఇతరు లెవ్వరును ఆపురాణపురుషుఁడగు భగవంతు నెఱుఁగనే లేరు.

ఏవంరూపో మహా నాత్మా పావకం పురుషం గిరన్,
యోవై తం పురుషం వేద తస్యేహాత్మా నరిష్యతే,

యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౧౬

(యః=ఎవఁడు), ఏవంరూపః=ఇటువంటి ప్రజ్ఞానైకరసబ్రహ్మస్వరూపముగల, మహాన్ ఆత్మా=గొప్పయాత్మఁ గలవాఁడో, (యః=ఏవాఁడు), పావకం=అగ్నిని, గిరన్=మ్రింగుచున్న-ఉపసంహారము చేయుచున్న, తం=ఆ, పురుషం=జ్ఞానైకరసుఁడైన పురుషుని, యః=ఎవఁడు, వేద=తెలిసికొనుచున్నాఁడో, తస్య=వానికి, ఇహ = ఈలోకమునందే - ఈదేహమునందే, ఆత్మా=ఆత్మ, నరిష్యతే=నశించదు.

తా. పరబ్రహ్మ పోల్చుటకు తగినరూపము లేనివాఁడు—అనగా నీ చర్మచక్షువుల కగపడు పదార్థములలో నతనిరూపముతో పోల్పఁ దగినదేదియు లేదు. ఈలోకమునంతయు నుపసంహారము చేయఁగలవాఁడు. వాని స్వరూపమును తెలిసికొనువాఁ డెవఁడో వానియాత్మ నశించనిది. దీనిని యోగులు తప్ప నితరు లెవ్వరెఱుంగ లేరు.

తస్మాత్సదా సత్కృత స్స్యాత్ న మృత్యు రమృతం కుతః,
సత్యానృతే సత్యసమానబన్ధినీ సతశ్చ యోని రసతశ్చైక ఏవ,
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనం. 17

టీ. తస్మాత్=ఆకారణమువలన, (యః=ఎవఁడు), సదా=అహర్నిశలును-ఎల్లప్పుడు, సత్కృతః స్యాత్ = సచ్చిదానందాద్వితీయబ్రహ్మాత్మస్వరూపియగుచున్నాఁడో, తస్య=వానికి, మృత్యుః = జననమరణ లక్షణయుక్తమగు సంసారము, న=లేనేలేదు. అమృతం=స్వర్గాదిసుఖము, కుతః=ఎక్కడిది— మరణముండిన స్వర్గాదిసుఖములుకలుగును, మరణమే లేనంతట అవి ఎక్కడివనిభావము. సత్యానృతే=సత్యానృతమందు (వర్తించుటంజేసి), సత్యసమానబన్ధినీ=పరబ్రహ్మను, సత్యమైనదానినిగా తెలిసికొన్నవాఁడై, సతః =లౌకికమునకును, అసతశ్చ=వ్యావహారికమునకును, యోనిః=కారణము, ఏకమేవ=ఒక్కఁడే (అద్వితీయుఁడైన బ్రహ్మమే.) అని యెఱుంగవలయును.

తా. మేలుచేయుచుండు సచ్చిదానందాద్వితీయబ్రహ్మస్వరూపియగు జీవునకు జననమరణములే లేవు. సంసార మందువలన లేదు. సదసత్తులకు రెంటికిని కారణ మొక్కటియె. ఇట్లు సత్యానృతవర్తియగు పరబ్రహ్మస్వరూపమును యోగులే యెఱుంగుదురు. అనఁగా, ఇట్టివాఁడు మోక్షార్హుఁడు. బ్రహ్మజ్ఞానికి జననమరణరూపమగు సంసారము లేదు. మరణమే లేనప్పుడు మరణాంతర మనుభవింపఁదగిన స్వర్గాదులును లేనేలేవు. ఏలయనగా స్వర్గాదులగు సుఖములు నిత్యములు.

అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
న దృశ్యతేఽసౌ హృదయే నివిష్టః,
అజశ్చరో దివారాత్రమతన్ద్రితశ్చ
స తం మత్వా కవిరాస్తే ప్రసన్నః. ౧౫

టీ. అన్తరాత్మా = అన్తరాత్మయగు, పురుషః = పరబ్రహ్మ, (ఆకాశాదిదేహాన్తమగు జగత్తును సృజించి) అంగుష్ఠమాత్రః=అంగుష్ఠప్రమాణస్వరూపియైనవాఁడు. అసౌ = ఈపరమాత్మ, హృదయే = హృదయాకాశమున, నివిష్ఠః=ఉండువాఁడై,న దృశ్యతే=చర్మచక్షుస్సులకు కనఁబడఁడు. సః = ఆపరబ్రహ్మ, అజః = అజుఁడని, చరః=చరుఁడని, దివారాత్రమతంద్రితః చ = అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, మనోమయ, ఆనందమయ) పఞ్చకోశముల నతంద్రితుఁడై ఎల్లప్పుడుండువాఁడు అని, తం= వానిని, కవిః=జ్ఞాని, మత్వా=తెలిసికొని, ప్రసన్నః = కృతార్థుఁడై, ఆస్తే= ఉంటున్నాఁడు.

తా. ఆకాశాదిదేహాన్తసృష్టి యొనర్చి పరమాత్మ అంగుష్ఠమాత్రశరీరుఁడై యుంటున్నాఁడు. ఆతనిచిత్సదానందాద్వితీయస్వరూపమును చర్మనేత్రములతో చూడలేము. ఆట్టివానిని జ్ఞాని తెలుసుకొని కృతార్థుఁడగును.

*తస్మాచ్చ వాయు రాయాతః తస్మింశ్చ ప్రలయ స్తథా,
తస్మా దగ్నిశ్చ సోమశ్చ తస్మాచ్చ ప్రాణ ఆగతః. ౧౯
*తత్ప్రతిష్ఠా త దమృతం లోకా స్త ద్బ్రహ్మ త ద్యశః,
భూతాని జజ్ఞిరే తస్మాత్ ప్రళయం యాన్తి తత్ర చ. ౨౦

టీ. తస్మాత్ చ=ఆపరమాత్మకారణమువలననే, వాయుః=వాయువు, ఆయాతః=వీచుచున్నాడు. తథా=అట్లు, తస్మిన్ చ = వానియందే, ప్రలయః=ప్రలయము, (భవతి=అగుచున్నది). తస్మాత్ =వానికారణమువలననే, అగ్నిః చ సోమః చ=అగ్నియు, చంద్రుడును, (ఆగతః=వచ్చుచున్నారు-ప్రకాశించుచున్నారు). తస్మాత్ చ = వానినుండియే, ప్రాణః = జీవము, ఆగతః=వచ్చుచున్నది. తత్ = అదియ (అపరబ్రహ్మమే), ప్రతిష్ఠా =(జగత్తునకు) ఆధారము, తత్ =అదియ, అమృతం=చావులేనిది, తత్ = అదియ, లోకాః=కంటికగపడునవియన్నియునైయున్నది. తత్ బ్రహ్మ = అదియ బ్రహ్మము. తత్ యశః=అద్దియ కీర్తి. తస్మాత్ =దానివలననే, భూతాని=భూతములు, జజ్ఞిరే=కలిగినవి. తత్రచ = వానియందే, ప్రలయం=లీనత్వమును, యాన్తి = చెందుచున్నవి.

తాత్పర్యము సుగమము.

ఉభౌ చ దేవౌ పృథివీం దివం చ
దిశశ్చ శుక్రం భువనం బిభర్తి,

---

* (ఈ రెండుశ్లోకములును నీలకంఠీయమునందు లేవు).

* ఈశ్లోకములకు పిమ్మట

"సర్వమేత త్తతో విద్యా త్త త్తద్వక్తుం న శక్నుమః,
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవంతం సనాతనమ్."

అని శ్లోకము బొంబయి ముద్రితకోశమునం దున్నది.

తస్మాద్దిశ స్సరితశ్చ స్రవన్తి
తస్మాత్సముద్రా విహితా మహాన్తాః. ౨౧

టీ. (తత్=అదియే), ఉభౌచ దేవౌ=రెండైనజీవేశ్వరులను,బిభర్తి=భరించుచున్నది, పృథివీం=భూమిని, దివం చ=ఆకాశమును, దిశశ్చ=దిక్కులను, శుక్రం=తేజోవంతమగు,భువనం=జగత్తును, బిభర్తి = భరించుచున్నది. తస్మాత్=దానినుండియే, దిశః=దిక్కులును, సరితశ్చ=నదులును, స్రవన్తి=స్రవించుచున్నవి-జారుచున్నవి. మహాన్తాః=గొప్పవియగు, సముద్రాః = మహాసముద్రములు, తస్మాత్=దానినుండియే, విహితాః=సృజింపఁబడినవి.

తా. ఆపరమాత్మయే జీవేశ్వరుల కాధారము. భూమిని, ఆకసమును, దిక్కులను, తేజోవంతమగు జగత్తునంతయు భరించునది ఆపరబ్రహ్మమే. ఏళ్లును, సముద్రములును ఆతనివలననే ప్రవహించును.

యత్సహస్రం సహస్రాణాం పక్షౌ నాహృత్య సంపతేత్,
నాన్తం గచ్ఛేత్కారణస్య యద్యపి స్యాన్మనోజవం,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. ౨౨

టీ. (యః=(ఎవఁడైనను), సహస్రాణాం సహస్రం=వేలపర్యంతము, పక్షౌ=ఱెక్కలను, ఆహృత్య=పొంది, సంపతేత్ యత్=ఎగిరినను, మనోజవం=మనోవేగముతో, యద్యపి స్యాత్=ఎప్పుడైనను వేగముతో పోయినను, కారణస్య=సర్వకారణుఁడైన పరమాత్మయొక్క, అన్తం=అన్తమును, నగచ్ఛేత్=పొందఁజాలఁడు, పొందనే పొందఁడు.

తా. ఎవఁడైనను వేనవేల ఱెక్కలతో నెగిరినను, మనోజవముతో పోయినను, పరమాత్మయొక్క అంతమును చూడలేఁడు. ఆపరమాత్మను భక్తులగు యోగులే తెలిసికొందురు. ఇతరు లెవరును తెలిసికొనఁజాలరు.

అదర్శనే తిష్ఠతి రూప మస్య
పశ్యన్తి చైనం సుసమిద్ధసత్త్వాః,
హీనో మనీషీ మనసాఽభిపశ్యతే
య ఏనం విదు రమృతాస్తే భవన్తి. ౨౩

టీ. అస్య=పరమాత్మయొక్క, రూపం = స్వరూపము, అదర్శనే=చూచుటకు వీలుకానిదిగా, తిష్ఠతి=ఉన్నది, ఏనం = ఈపరమాత్మను, సుసమిద్ధసత్వాః=చక్కగా వెలుంగు మనస్సుగలవారు, పశ్యన్తి=చూచుచున్నారు. (యజ్ఞాది కర్మలచే ప్రజ్వలింపఁ జేయఁబడిన మనోవాక్కాయ కర్మములకు అంతఃకరణచతుష్టయసిద్ధిగలవారు చూచెదరు.) హీనః=రాగద్వేషాది దుర్గుణ రహితుఁడగు, మనీషీ=విద్వాంసుఁడు, అభిపశ్యేత్=చూచుచున్నాఁడు. ఏనం=ఈపరమాత్మను, యే=ఎవరు, విదుః = తెలిసికొనుచున్నారో, తే=వారు, అమృతాః = అమరణధర్మముగలవారు-ముక్తులు, భవన్తి=అగుచున్నారు.

తా. పరబ్రహ్మస్వరూపము చర్మచక్షురింద్రియాదుల కగోచరమైనను, కర్మానులగు యజ్ఞయాగాదులచే మలినరాహిత్యముగల మనస్సుతో యోగులు చూచుచున్నారు. అట్టివారు ముక్తులయ్యెదరు.

ఇమం యస్సర్వభూతేషు ఆత్మాన మనుపశ్యతి,
అన్యత్రాన్యత్ర యుక్తేషు స కిం శోచేత్తతః పరమ్? ౨౮

టీ. యః=ఎవఁడు, ఇమం=ఈ, ఆత్మానం = (సర్వాన్తర్గతుఁడగు) ఆత్మను, సర్వభూతేషు = సర్వభూతములయందును, అనుపశ్యతి = చూచుచున్నాఁడో, అన్యత్రాన్యత్ర = దేహేంద్రియాదులందు, యుక్తేషు=శరీరాద్యభిమానులందు, సః=వాఁడు, తతఃపరం=పిమ్మట (సర్వభూతములందును స్వాత్మను చూచినపిమ్మట), శోచేత్ కిం = దుఃఖించునా ఏమి? (అనఁగా సర్వభూతములయందును తన్నుఁజూచినవాఁడై, కృతార్థుఁడైనవాఁడు, దుఃఖించనే దుఃఖింపఁడనుట.)

తా. పరమాత్మ సర్వాంతర్యామి, సర్వోపగతుఁడు అని తెలిసికొని ధ్యానించువానికి దేహమువలనఁగాని ఇంద్రియాదులవలనఁగాని కలుగు దుఃఖము బాధింపనేఱదు.

యథోదపానే మహతి సర్వతస్సంప్లుతోదకే,
ఏవం భూతేషు సర్వేషు బ్రాహ్మణస్య విశేషతః. ౨౯

టీ. సర్వతః=అంతటను, సంప్లుతోదకే=నీరు నిండియుండఁగా, మహతి=గొప్పదియగు, ఉదపానే=తటాకమునందు, (నీరుతో) యథా=ఏరీతిగా (ప్రయోజనము లేదో), (తథా=అట్లే) బ్రాహ్మణస్య=బ్రహ్మజ్ఞానికి, విశేషతః=విశేషముగా, సర్వేషు భూతేషు=సమస్తభూతములందును, ఏవం=ఇట్లే (ప్రయోజనములేదు).

తా. గొప్పచెరువులోని నీటితో ప్రయోజనము, లోకమంతయు జలమయమైయుండునపు డెట్లు అనవసరమో యట్లే బ్రహ్మజ్ఞాని కితరజీవములందుఁ బొందఁదగిన ప్రయోజనమును అనవసరమే.

అహమేవాస్మి వో మాతా పితాపుత్రోఽస్మ్యహం పునః,
ఆత్మాహమస్మి సర్వస్య యచ్చ నాస్తి యదస్తి చ. ౨౬

టీ. వః=మీకు, అహమేవ=నేనే, మాతాఅస్మి=తల్లిని, పునః=మఱియు, పితాఅస్మి=తండ్రినైతిని, పుత్రః అస్మి=పుత్త్రుఁడనైతిని, యత్ చ నాస్తి=ఏశరీరము లేదో, యత్ అస్తిచ=ఏశరీరముకలదో, అస్య=ఈ, సర్వస్య=సర్వమునకు, ఆత్మా=ఆత్మను, అహం=నేను, అస్మి=అగుచున్నాను.

తా. ఇందువలన ఆధిభౌతికపిత్రాదికమును మహర్షి పామరుఁడగు ధృతరాష్ట్రునకు తెలుపుచున్నాఁడు.—అందు మహర్షియైన సనత్సుజాతుఁడు తాను పామరుఁడైన యవివేకి కాకపోయినను, సంసారులయనుభవమును తనయం దారోపించుకొని పరమాత్మస్వరూపనిర్ణయమును చేయుచున్నాఁడు.—ఎట్లనఁగా—ఒక్కజీవుఁడే యొక్కజన్మమున తల్లిగను, మఱియొక్కజన్మమున తండ్రిగను, ఇంకొకజన్మమున పుత్త్రుఁడుగను మాఱుచున్నాఁడు. ఈవిధమైనశరీరమున కొక్కజీవుఁడేవిధముగా నాత్మ యగునో అదేరీతి గా భూతభవిష్యచ్ఛరీరములకును ఆత్మయగుచున్నాఁడు.

పితామహోఽస్మి స్థవిరః పితా పుత్రశ్చ భారత,
మమైవ యూయమాత్మస్థా న మే యూయం నచాప్యహమ్,

టీ. హేభారత = ఓధృతరాష్ట్ర! అహం=నేను, స్థవిరః=ముదుసలియగు, పితామహః=పితామహుఁడను, అస్మి=అగుచున్నాను. (అనఁగా

అనాదిసిద్ధుఁడగు పరమాత్మ నగుచున్నా ననుట). పితా=తండ్రియు, పుత్రశ్చ=పుత్త్రుఁడును, (అహమేవ=నేనే), ఆత్మస్థాః = పరమాత్మనియమము గల, యూయం=మీరును, మమఏవ=నాకు సంబంధించినవారే. యూయం =మీరు, న మే=నాకుసంబంధించినవారును కారు. న, చ, అహంఅపి=నేను మీకును సంబంధించినవాఁడను కాను.

తా. అజీవుఁడు జన్మభేదంబులచేత తాను హిరణ్యగర్భుఁడగు బ్రహ్మయగుచున్నాఁడు. పుత్త్రుఁడగుచున్నాఁడు. మధ్యకాలమున తండ్రియగుచున్నాఁడు. కాలభేదములచేత నిట్టివాఁడగుచున్నాఁడు. పరమాత్మ సంబంధులని విచారించఁగా నందఱును అదేవిధముగ తేలుచున్నారు. అందఱ కన్యోన్యసంబంధము కలదు. శరీరమునకు గల సంబంధ మాత్మకు లేదు. అని తాత్పర్యము. ఈశ్లోకార్థమువలన మహర్షి ఆధిదైవికపిత్రాదిభావమును తెలిపినాఁడు.

ఆత్మైవ స్థానం మమ జన్మ చాత్మా
ఓతప్రోతో ౽హమజరప్రతిష్ఠః,
అజశ్చరో దివారాత్రమతంద్రితో ౽హం
మాం విజ్ఞాయ కవి రాస్తే ప్రసన్నః. ౨౮
అణో రణీయాన్ సుమనా స్సర్వభూతే ష్వవస్థితః,
పితరం సర్వభూతానాం పుష్కరే నిహితం విదుః. ౨౯

టీ. మమ=నాకు, స్థానం=ఉనికిపట్టు, ఆత్మైవ=ఆత్మయే. మమ=నాకు,జన్మచ=జన్మమును,ఆత్మా=ఆత్మయే,అజరప్రతిష్ఠః=స్వమాహాత్మ్యము చేత జరామరణ వర్జితుఁడనై నిలుకడగల, ఓతప్రోతః=ఓతప్రోత స్వరూపముగలవాఁడను.అహం=నేను, అజః=జన్మములేనివాఁడను,అతంద్రితః=ప్రాలుమాలిక లేనివాఁడనై, దివారాత్రం=రాత్రింబగల్లు—అనిశముండువాఁడను. కవిః=విద్వాంసుఁడు—బ్రహ్మవేత్త, మాం=నన్ను, విజ్ఞాయ=(ఇటువంటివానినిగా)ఎఱింగి, ప్రసన్నః=నెమ్మదిగలమనస్సుతో,ఆస్తే=ఉన్నాఁడు.

టీ. సుమనాః=శుభదమగు, (రాగద్వేషమదమాత్సర్యశోకమోహాది ధర్మవర్జితమును, కేవలమునగు చిత్సదానందాద్వితీయ బ్రహ్మాత్మాకారముగల), అణోః=సూక్ష్మమైన పదార్థమునకంటె, అణీయాన్=పరమాణువై, సర్వభూతేషు = సర్వప్రాణులహృదయకమలమధ్యమునందు, అవస్థితః=ఉంటున్నాఁడు. సర్వభూతానాం=సర్వప్రాణులను సృజించిన, పితరం=పరమేశ్వరుని, పుష్కరే=హృదయపుండరీకమందు-అనగా హృత్కమలమునందు, నిహితం=ఉన్నవానినిగా, విదుః=తెలిసికొనుచున్నారు. పరమాత్మను ఆత్మచేతనే తెలియుచున్నవారు యోగులు అనిభావము.

తా. పరమాత్మయు నాస్థానము. నాజన్మమున కదియు కారణము. వస్త్రమునందు, నూలు, పడుగునందును, పేకయందును ఉండువిధముగ, పరమాత్మ నాయందును అన్నిటియందు నున్నాఁడు. సదా భోగాదుల కెడమీయక ప్రవర్తించుచున్నాను. నే నిట్టివాఁడను. కాబట్టి నాయందు పరమాత్మ ప్రసన్నుఁడై యున్నాఁడు. అని సనత్సుజాతుఁడు తనయనుభవమును చెప్పి ఇంకను వామదేవాదిఋషులు చెప్పినవారియనుభవమును సూచించుచున్నాఁడు. పరమాత్మ పరమాణువునకంటె సూక్ష్మమైనవాఁడు. అతఁడు సర్వాంతర్యామి; అతఁ డందఱను సృజించి యందఱిహృత్కమలములం దధిష్ఠానము కలిగియున్నాఁడు. అట్టి పరమాత్మను బ్రహ్మనిష్ఠగలవారలు ధ్యానించి ముక్తినిఁ జెంది కృతార్థులగుదురు. జననమరణాదులు లేక పరబ్రహ్మతో నైక్యభావమును జెందుదురు. సర్వమును సంగ్రహించి శ్రీశంకరభగవత్పాదు లీక్రింది శ్లోకత్రయమును రచించినారు.

1. నిత్యశుద్ధబుద్ధ ముక్తభావమీ(మై)శ [1]మాత్మనా,
భావయన్ షడిన్ద్రియాణి సంనియమ్య నిశ్చలః.
2. అస్తివస్తుచిద్ఘనం జగత్ప్రసూతికారణమ్,
[2]స నశ్వరం తదుద్భవం జగత్తమోనుదం చ యత్.

---

1 మాత్మనః. 2 అనశ్వరం చ తద్భవం.

౩. తత్పద్వైకవాచకం సదాఽమృతం నిరఞ్జనమ్,
చిత్తవృత్తి[1]దృక్సుఖం తదస్మ్యహం తదస్మ్యహమ్.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యా ముద్యోగపర్వణి ధృతరాష్ట్రసనత్కుమారసంవాదే శ్రీమత్సనత్సుజాతీయే చతుర్థోఽధ్యాయః.

శ్రీమత్సుజాతీయం సమాప్తమ్.



1 భృత్సుఖం.

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు
ముద్రితము—1915.

శ్రీ రస్తు.

సనత్సుజాతీయ

# శ్లోకానుక్రమణిక.



# సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి | రు. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, సటీక | ... | 0 | 2 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| డిటో మూలము, చిన్నసైజు | ... | 0 | 12 |
| సుందరకాండము, మూలము, చిన్నసైజు | | 0 | 12 |
| సుందరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము, నూతనముద్రితము | | 1 | 4 |
| శ్రీమద్రామాయణము, మూలము, చక్కనికూర్పు | | 1 | 12 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| యజుర్వేదసంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు. | | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | | 0 | 2 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు, మూలము, చిన్నసైజు | | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| వ్రతచూడామణి 360 వ్రతములు, మంచికాగితములపై చక్కగముద్రితము | ... | 1 | 4 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేకవిషయములంజేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానురూపముగఁ బరిష్కరించిముద్రించియున్నాము. సాధారణప్రతి | ... | 1 | 4 |
| డిటో మంచిప్రతి | ... | 2 | 0 |
| మహాన్యాసము, చిన్నసైజు, శుద్ధప్రతి | ... | 0 | 2 |
| రుద్రము, పురుషసూక్తము వగైరాలు, చిన్నసైజు | ... | 0 | 5 |
| మంత్రపుష్పము, సటీక, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, చిన్నసైజు | ... | 0 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

# సంస్కృతగ్రంథములు.

| ప్రతి 1-కి | | రు. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక, చిన్నసైజు | ... | 0 | 2 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవ ఆహ్నికము, చిన్నసైజు | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ,, | ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము.—వ్రతసంకల్పము మొదలు పూజముగియు వఱకు చేయవలసినవిధులు తెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ, గణాధిపతిపూజ, షోడశోపచారశ్లోకములు మొదలగువానిని తాత్పర్యముతోడ ముద్రించినారము. ఇందు వినాయక వ్రతము, వరలక్ష్మీవ్రతము, సరస్వతీ వ్రతము, అనంతవ్రతము, కేదారేశ్వరవ్రతము, గరుడపంచమీ వ్రతము అను 6 వ్రతములు గలవు. | ... | 0 | 6 |
| వ్రతరత్నాకరము, ద్వితీయభాగము.—ఇందు ఋషిపంచమీ, మథనద్వాదశీ, అమావాస్యాసోమవతీ, కృష్ణాష్టమీ, శ్రీరామనవమీ, ఆముక్తాభరణసప్తమీ, భక్తేశ్వర, శతవర్తి, లక్షవర్తి, త్రిరాత్రి, చిత్రగుప్త, క్షీరాబ్ధిశయన, సావిత్రీగౌరీ, సంపద్గౌరి, సత్యనారాయణ, రథసప్తమీ, సంకటచతుర్థి, ఏకాదశీగురువారము, శ్రవణద్వాదశీ, శరన్నవరాత్రి, నృసింహజయంతీ అను 21 వ్రతములు గలవు. | ... | 0 | 14 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 1 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| సంధ్యావందనభాష్యము, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| మంత్రపన్నములు, మూలము | ... | 0 | 3 |
| కౌలామృతము, సటీక, చక్కనికూర్పు, | ... | 0 | 12 |
| శ్రీపతి, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| బృహజ్జాతకము, సటీక, చక్కనిప్రతి, నూతనముద్రితము | ... | 1 | 4 |
| ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | | 0 | 8 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనిప్రతి | | 0 | 5 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.